# మరణము తర్వాత జీవితము



రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

www.thraithashakam.org







# మరణము తర్వాత జీవితము


<u>రచయిత:</u> **త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–39 ద్వితీయ ముద్రణ : డిసెంబర్–2017

ప్రతులు : 1000 **వెల : 60 /-**






## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు.
92) బ్రహ్మ-రావణ బ్రహ్మ-భగవాన్ రావణ బ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) మానవత్వము.
95) సుప్రసిద్ధి బోధ.
96) రూపము మారిన గీత.
97) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
98) రాజకీయము×రాజకీయము.
99) ఉగ్రవాదము స్వర్గము కొరకే.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. బ్రహ్మవిద్య
131. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

---

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# మరణము తర్వాత జీవితము

'మరణము' అను మాటను వినేదానికి కూడా కొందరు ఇష్టపడరు. మరణము అంటే వారికి ఎంతో భయముండుట వలన వారు ఆ మాటను వినుటకు కూడా ఇష్టపడరు. ఏ ప్రాణికయినా జీవితమును ముగింపు చేయునది మరణము. ప్రతి మనిషికి తన జీవితములో ఎప్పుడో ఒకప్పుడు మరణమున్నా దానిని మరచిపోయి బ్రతుకుచుందురు. అయితే వానికి తెలియకుండానే 'మరణము' మనిషి జీవితమునకు ముగింపు చేయుచున్నది. మనిషి జీవితములో **ఒక గడువు** ముందే నిర్ణయించబడియుండును. ఆ గడువునే **మరణము** అంటున్నాము. మరణము పుట్టిన ప్రతి జీవరాశికి గలదు. దేవుని చట్టము ప్రకారము అనగా దేవుని ధర్మము ప్రకారము మరణము అందరికీ సమానమైనదే. ఒక మనిషి ఎలా మరణిస్తున్నాడో అలాగే ప్రతి మనిషి మరణించవలసియున్నది. ఎవడు ఎట్లు చచ్చినా, ఎప్పుడు చచ్చినా, ఎటువంటి పరిస్థితిలో చనిపోయినా మరణములో ఒకే విధానమైన అనుభవమునే ప్రతి మనిషి పొందును. అందువలన మరణము అందరికీ సమానమైనదని చెప్పగలము. మరణమును తెలుగుభాషలో 'చావు' అనినా 'మృత్యువు' అనినా అది మరణమే అని అందరికీ తెలుసు. మరణము అనునది ఒకటే అయినా అది నాలుగు రకములుగా గలదు. వాటిని గురించి విపులముగా చెప్పుకొంటే ఇలా గలదు.

మరణము ప్రతి మనిషికి ఒకటే అయినా మరణము తర్వాత గల జీవితమునుబట్టి మరణము నాలుగు రకములుగా చెప్పబడుచున్నది. నాలుగు రకముల మరణములను గురించి మా రచనలలో **"మరణ రహస్యము"** అను గ్రంథములో వివరముగా చెప్పబడినది. అయినా ఇప్పుడు దానిని గురించి కొద్దిగా చెప్పుకొందాము. మరణము తర్వాత గల జీవుని స్థితినిబట్టి మనిషియొక్క మరణములను నిర్ణయించవచ్చును. దానిప్రకారము

మనిషి మరణములు మొత్తము నాలుగు రకములుగా గలవు. **ఒకటి కాల మరణము, రెండు అకాల మరణము, మూడు తాత్కాలిక మరణము, నాలుగు ఆఖరి మరణము.** ఇందులో నాల్గవ ఆఖరీ మరణము అరుదైనది, కావున దానిని వదలితే మనిషి పొందు మరణములు మూడేనని చెప్పవచ్చును. మనిషికి అనేక జీవితములలో అనేకమార్లు మూడు రకముల మరణములు సంభవించుచుండవచ్చును. ఈ మూడు మరణముల వెనుక మనిషి జీవితము వేరువేరు విధములుగా యుండుటను మనిషి అనుభవరీత్యా గ్రహించవచ్చును. నాలుగవ మరణమయిన ఆఖరీ మరణములో మాత్రము జీవునికి ఏ అనుభవము ఉండదు. ఒక విధముగా అది ప్రత్యేకమైన స్థితియని చెప్పవచ్చును. మరణము నాలుగు విధములుగా ఉన్నదని చెప్పడము, ఇంతవరకు ఎవరూ చెప్పని విషయమైనందున, ఇది అందరిలో సంశయములను రేకెత్తించునదై ఉన్నది. మరణము అందరి అనుభవములో యున్నా ఇది ఎవరికీ అర్థముకాని విషయమైనందువలన, మరణము తర్వాత ఎవరికీ జ్ఞాపకముండక పోవడము వలన, ఈ విషయము పాతదైనా అందరికీ క్రొత్తదిగానే ఉన్నది. అందువలన ఈ విషయమంతయూ ఎన్నో రకముల ప్రశ్నలను సంధించి తెలియవలసిన అవసరమున్నది. ఇక్కడ ప్రశ్నమాదే, జవాబు మాదే, వినే లాభము మీదే! అందువలన ఎంతో క్రొత్త విషయమును పొందు లాభమును ఎవరూ వదులుకోకూడదని చెప్పుచున్నాము. ప్రశ్న మాదే, జవాబు మాదే అయినా, దానిని గ్రహించు లాభము ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా ఉండవచ్చును. తక్కువ లాభమును పొందక ఎక్కువ లాభమునే పొందమని కోరుచున్నాము.

**ప్రశ్న :- ఇప్పుడున్న మూడు మతములలో రెండు మతముల వారు మనిషి ఒకమారే చనిపోవునని, ఒకే మరణము గలదని చెప్పుచుండగా మీరు నాలుగు**

**రకముల మరణములున్నాయని చెప్పచున్నారు. మీ మాటకు శాస్త్రబద్ధత యున్నదా?**

**జవాబు :-** శాస్త్రబద్ధత లేని విషయమును మేము ఎప్పుడూ చెప్పము. అయితే మనిషి ఒకేమారు పుట్టి ఒకేమారు చనిపోవుననీ, తర్వాత అతనికి జన్మలేదనీ, అట్లే మరణము లేదనీ చెప్పు వారి మాటలకు శాస్త్రబద్ధత యున్నదా? అని నేను అడుగుచున్నాను. దైవగ్రంథములలో కర్మయున్నదని చెప్పారు, కర్మప్రకారము జన్మలున్నవని కూడా చెప్పారు. ఈ విషయము మూడు దైవగ్రంథములలో గలదు. అటువంటప్పుడు అన్ని మతముల వారు ఒకే మనుషజాతియై ఉండగా, ఒక మతములో జన్మలుండడము మరియొక మతములో జన్మలు లేకుండా పోవడము అంటూ ఏమీలేదు. **'ప్రతి జీవికి పుట్టుకవుంది, చావు వుంది. చనిపోయిన వెంటనే తిరిగి పుట్టుక వుంది. ఇది శాస్త్రబద్ధమైన విషయము.'** గ్రంథములో చెప్పినది చెప్పినట్లే ప్రపంచములో ప్రత్యక్షముగా జరుగుచున్నది. ప్రత్యక్షముగా జరుగునది సత్యమైనదని అందరూ ఒప్పుకోక తప్పదు. **ఏది సత్య సమేతమైనదో అదే శాస్త్రమగును.** ఏది శాస్త్రమైనదో అదే జరిగి తీరును. ఏది జరుగుచున్నదో దానిని కాదనుటకు వీలులేదు. అందువలన శాస్త్రమును ఎవరూ కాదనలేరు.

**ప్రశ్న :- ఆగండి! మామాటకు సూటిగా సమాధానము చెప్పండి. మూడు దైవగ్రంథములలో ఒక్క దానిలో అయినా మీరు చెప్పు తాత్కాలిక మరణము పేరున్నదా? అకాల మరణము పేరున్నదా? ఎక్కడా వాటి పేరే లేనిది మీరు దైవగ్రంథములో గల విషయములేనని, శాస్త్రబద్ధమైన విషయములేనని ఎలా చెప్పగలరు? మూడు దైవగ్రంథములు బ్రహ్మావిద్యా శాస్త్రమునకు సంబంధించిన వేనని మీరే చెప్పారు. అయితే వాటిలో లేని విషయమును మీరు శాస్త్ర**

**విషయమంటున్నారు. అలాంటప్పుడు మీమాట అసత్యము కాదా? అసత్యమును చెప్పుచూ మీరు మాటలగారడీతో వాటినే శాస్త్రబద్ధత గల విషయములని చెప్పడము తప్పుకాదా!యని అడుగుచున్నాము.**

**జవాబు :-** అసత్యమును సత్యముగా మేము చెప్పలేదు. నేను ముందే ఏదయితే శాస్త్రమో అదే సత్యమని, ఏదయితే సత్యమో అదే శాస్త్రమని చెప్పాను. అటువంటప్పుడు అసత్యమును శాస్త్రమని నేనెలా చెప్పగలను. పైగా అటువంటి అవసరమూ నాకు లేదు. ఏదయినా లాభము ఉపేక్షించు వారు అసత్యమును సత్యముగా చెప్పవచ్చునేమోగానీ, ఏ లాభమును ఆశించని నాకు అటువంటి అవసరమే లేదు. **సత్యమును సత్యముగా, అసత్యమును అసత్యముగా చెప్పడము నా కర్తవ్యము.** అందువలన శాస్త్రము కాని దానిని అశాస్త్రీయమని చెప్పుచున్నాము. మేము చెప్పునది శాస్త్రీయమే అయినప్పుడు, సత్యమే అయినప్పుడు శాస్త్రములైన మూడు దైవగ్రంథములలో లేదని మీరంటున్నారు. వాస్తవమే! మేము చెప్పిన పేర్లు మూడు గ్రంథములలో ఎక్కడా ప్రస్తావనకు రాలేదని నేను కూడా చెప్పుచున్నాను. అయినా నా మాట శాస్త్రమని చెప్పుటకు, మూడు గ్రంథములలోని విషయమే అని చెప్పుటకు ఆధారము గలదు. ముఖ్యముగా నేను చెప్పుమాట శాస్త్రముకాదని ఎవరూ చెప్పుటకు వీలులేదు ఎందుకనగా!

శాస్త్ర విషయములు రెండు రకములుగా గలవు. ముందుగా తెలియజెప్పినవి ఒక రకముకాగా, క్రొత్తగా పరిశోధన చేసి కనుగొనునవి ఒక రకము. భూమికి ఆకర్షణశక్తియున్నదని కొంతకాలము ముందు తెలియదు. తర్వాత కొంత కాలమునకు న్యూటన్ అను వ్యక్తి తన పరిశోధన ద్వారా కనుగొన్న విషయమును తెలియజెప్పాడు. భూమికి ఆకర్షణ వుందని న్యూటన్ పరిశోధన ద్వారా తెలిసినది. అది శాస్త్రబద్ధమైన సత్యమైన

విషయమే అయినందున దానిని శాస్త్రము అంటున్నాము. ముందు తెలియని శాస్త్రమును తర్వాత కూడా తెలియవచ్చును. ఈ విధముగా ఆది నుండి ఎన్నో శాస్త్ర విషయములు ముందు వెనుక తెలియబడుచున్నవి. ఏది ఏమయినా సత్యప్రమాణమే శాస్త్ర ప్రమాణమగుచున్నది. దీనినిబట్టి శాస్త్ర విషయములన్నియూ ముందే చెప్పబడలేదనీ, అప్పుడప్పుడు పరిశోధనల ద్వారా బయటికి వచ్చుచుండునని తెలియుచున్నది. మరణమును, చివరి మరణమును ఆదిలోని భగవద్గీతయందే చెప్పియున్నా అకాల మరణమును, తాత్కాలిక మరణమును ఇప్పుడు మేము వివరముగా చెప్పుచున్నాము. దీనితో మొత్తము నాలుగు మరణములు శాస్త్రబద్ధమైనవి. భగవద్గీతలో కేవలము మరణమును గురించి తర్వాత జన్మను గురించి చెప్పడమేగాక, చివరి మరణము లేక ఆఖరీ మరణమును గురించి కూడా చెప్పడమైనది. అయితే మరణమునకు, ఆఖరీ మరణమునకు ముందున్న అకాల మరణము, తాత్కాలిక మరణమును గురించి చెప్పియుండలేదు. భగవద్గీతలో అప్పటికి అవసరమైన ముఖ్యమైన ఆధ్యాత్మిక విషయములన్నీ చెప్పబడినవి. నిద్ర మెలుకువను గురించి చెప్పినవాడు స్వప్నమును గురించి చెప్పలేదు. అలాగే మరణము, ఆఖరీ మరణమును గురించి చెప్పినవాడు మిగతా తాత్కాలిక మరణమును గురించిగానీ, అకాల మరణమును గురించిగానీ చెప్పలేదు. తర్వాత ఆ విషయములను మనుషుల మెదడుకు అందించి మనుషులతోనే చెప్పించాడు. అందువలన తర్వాత చెప్పబడిన రెండు మరణములు శాస్త్రబద్ధమైనవేయని చెప్పవచ్చును.

**ప్రశ్న :- ఆధ్యాత్మిక సంబంధ విషయములన్నియూ భగవద్గీతలో చెప్పబడినాయి అని మీరు ఒకప్పుడు చెప్పారు. తర్వాత ఇప్పుడు అక్కడ కొన్ని విషయములను చెప్పలేదు. అవి తర్వాత తెలియబడుచున్నవని చెప్పుచున్నారు. మీ మాటను నమ్మమంటారా?**

**జవాబు :-** నా మాట నమ్మమని చెప్పినట్లు రెండవ దైవగ్రంథమయిన దానిలో ఒకమాట చెప్పబడియున్నది అది ఏమనగా! **"నేను మీతో చెప్పవలసినవి ఇంకనూ అనేక సంగతులు గలవు. కానీ మీరు వాటిని ఇప్పుడు సహింపలేరు. అయితే ఆయన అనగా సత్యస్వరూపియైన ఆత్మ వచ్చినప్పుడు మిమ్ములను సర్వ సత్యములోనికి నడిపించును"** అని కలదు. దీనినిబట్టి ఒకేమారు అన్ని విషయములు తెలియలేదు తర్వాత తెలిసినవి కూడా శాస్త్రసంబంధ సత్యమైన విషయములేనని తెలియుచున్నది. అయితే మొదటి గ్రంథములో ఒక విషయమును అసంపూర్ణముగా చెప్పియుండును. ఆ విషయమునకు సంబంధించిన వివరము తర్వాత కాలములో సంపూర్ణముగా తెలియబడును. భగవద్గీత గ్రంథములో ఆత్మను గురించి చెప్పియున్నా, దాని వివరమునకు సంబంధించిన మాటలు బైబిల్‌లోగల నాలుగు సువార్తలలో గలవు. అలాగే భగవద్గీతలో కొద్దిగా చెప్పిన విషయములు కొన్ని ఖురాన్ గ్రంథములో వివరించి చెప్పడము జరిగినది. అట్లే మరణ విషయము కూడా మొదట భగవద్గీతలో కొంత చెప్పియున్నా, ఇప్పుడు సమగ్రముగా తెలియుచున్నది. మొదట గీతలో అన్ని విషయములున్నా కొన్నిటికి వాటి వివరములేదు. ఆ వివరము రెండవమారు తెలియబడుచున్నది. అలాగే మొదట కొన్ని సూచాయగా చెప్పిన విషయములు తర్వాత వచ్చినప్పుడు అవి పూర్తి క్రొత్తగా కనిపించును. తర్వాత తెలియబడినవి క్రొత్తవే అయినా, వాటి మూలములు భగవద్గీతలో ఎక్కడో ఒకచోట ఉండును. ఉదాహరణకు బ్రహ్మ, కాల, కర్మ, గుణ చక్రములు నేడు సవివరముగా తెలియబడినవి. అయితే వాటిని గురించి మూడు దైవ గ్రంథములలోనూ ఎక్కడా చెప్పలేదని కొందరనవచ్చును. అయితే మొదటి దైవగ్రంథమయిన భగవద్గీతలోనే అక్షర పరబ్రహ్మయోగ

మందు వాటి మూలమున్నదని మేము చెప్పాము. **నేడు మనకు తెలిసిన బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల గురించి పరోక్షముగా దేవుని ముద్రయని బైబిలు గ్రంథములోనూ, దేవుని చిహ్నము అని ఖురాన్ గ్రంథములోనూ చెప్పబడి యున్నదని ప్రజలు గ్రహించలేకపోయారు.** అందువలన అక్కడ లేని విషయములు మీరు ఎట్లు చెప్పుచున్నారని కొందరడుగుచున్నారు. ఉన్న విషయమునే క్రొత్తగా చెప్పుచున్నాము కావున అవి మీకు క్రొత్తగా కనిపించి యుండవచ్చును. ఒక గ్రంథములోయున్న విషయము మరియొక గ్రంథములో లేకపోవచ్చును. అలాగే ఒక గ్రంథములో లేని విషయము మరొక గ్రంథములో ఉండవచ్చును. మూడు గ్రంథములలో కనిపించని విషయము మా గ్రంథములలో కనిపించి యుండవచ్చును. అయినా మేము ఇప్పుడు చెప్పిన విషయములుగానీ, తర్వాత దైవగ్రంథములలోని విషయములు గానీ, వాటి పునాదులు ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో తప్పకయుండును. అందువలన ఆ విషయమును గుర్తించలేని వారికి అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథము ***"నేను తౌరాత్ (భగవద్గీత) గ్రంథములోని జ్ఞానమును ధృవీకరిస్తున్నానని"*** తెలియజేసినది. ఇవన్నీ గమనించిన తర్వాత ఎప్పుడు చెప్పినా శాస్త్రము శాస్త్రమే, సత్యము సత్యమేనని తెలియవలెను.

**ప్రశ్న :- మరణము అంటే ఏమిటి?**

**జవాబు :-** శరీరములో జరిగే పనులన్నీ నిలిచిపోవడమును మరణము అంటాము. ఈ విషయమును ఎవరూ కాదనలేరు. ఎందుకనగా! మరణము ప్రత్యక్షముగా జరిగే సత్యము. ప్రత్యక్షముగా జరిగే దానిలో శరీరములో జరిగే పనులన్నీ నిలిచిపోవడము అందరికీ తెలిసిన విషయమే. మరణమును గురించి ఇంకా కొంత వివరముగా చెప్పుకోగలిగితే ఈ విధముగా అర్థము

కాగలదు. **'మరణము'** అను పదమును పూర్వము **'అరణము'** అను పదముగా చెప్పెడివారు. కృతయుగములో అరణము అను పదముగాయున్న శబ్దము కాలక్రమమున కొంత మార్పుచెంది పలుకడములో మరణముగా చెప్పబడుచున్నది. అరణము అను మాటను వరుసగా కొన్నిసార్లు ఉచ్ఛరించితే మనము పలుకడములో కూడా 'అ' అను అక్షరము పోయి 'మ' అను శబ్దము వచ్చుచున్నది. ఈ విధముగా 'అరణము' అను పదము 'మరణము' అను పదముగా మారిపోయినది. నేడు వెనుతిరిగి చూడకుండా అందరూ మరణము అను శబ్దమునే వాడుచున్నారు. మరణము అను అర్థమునిచ్చు 'చావు' అను పదము కూడా కలదు. 'చచ్చుట' అను పదమును 'చావు' అను పదముగా కూడా చెప్పుచున్నాము. చచ్చుట లేక చచ్చిపోవుట అనినా, చావు అనినా రెండూ ఒకే అర్థము నిచ్చుచున్నవి. వాస్తవముగా 'అరణము' అను పదము 'మరణము' అను పదముగా మారిపోయినట్లు, 'సత్తు' అను పదమునుండి 'చచ్చు' అను పదముగా మారిపోయినది. 'సత్తుపోవుట' అను పదము చివరికి 'చచ్చిపోవుట' అను పదముగా మిగిలిపోయినది. శరీరములోని శక్తిని సత్తు, సత్తువ అని అంటుంటారు. 'సత్తు' అంటే 'ఆత్మ' అని అర్థము. సత్తు పోవుట అంటే శరీరములోని ఆత్మశక్తి శరీరమును వదలిపోయిందని అర్థము. ఈ విధముగా 'సత్తుపోవుట' అనుపదము చివరికి ఎట్లు 'చచ్చిపోవుట' అను పదముగా మారిపోయినదో అదే విధముగా 'అరణము' అను పదము 'మరణము' అను పదముగా మారిపోయినది.

చివరికి వ్యర్థముగా మారిపోవు శరీరమును 'చిత్తు' అని పెద్దలన్నారు. వ్యర్థ పదార్థములను చెత్త అని అనడము అందరము వినియేవుందుము. అయితే 'చెత్త' అను పదము 'చిత్తు' అను పదమునుండి

మార్పు చెందినది. పనికి రాని పేపర్లను చిత్తుపేపర్లు అని అన్నట్లు పనికి రాని వాటిని చిత్తు లేక చెత్త అనడము జరుగుచున్నది. చిత్తు చెత్తగా కాలక్రమమున మారినట్లు 'సత్తు' అను పదము 'చచ్చు' అను పదముగా మారిపోయినదని తెలిసినది. ఆవు శరీరములోని ఆత్మ పోయినప్పుడు పూర్వము 'ఆవు సత్తుపోయింది' అని అనెడివారు. అదే మాటనే ఇప్పటి కాలములో 'ఆవు చచ్చిపోయింది' అని అంటున్నారు. ఇదంతయూ గమనించితే 'చిత్తు' చెత్తగా మారినట్లు 'సత్తు పోవుట' చచ్చిపోవుటగా మారిపోయినదనీ, 'అరణము' మరణముగా మారిపోయినదని తెలియుచున్నది.

మరణము అను పదమునకు ఒక అర్థము గలదు. మరణము అను పదము అరణముగా ఉన్నప్పుడే దానికి ఒక అర్థము, కొంత వివరము ఉండెడిది. అరణము అను పదమును పూర్వము జ్ఞానులయిన పెద్దలు రెండుగా విభజించానారు. అ+రణము=అరణముగా ఉండేది. రణము అనగా యుద్ధము అని అర్థము. యుద్ధములో తీరిక లేకుండా కదలవలసి యుండును. యుద్ధములో కదలకుండా నిలబడితే శత్రువుల చేతిలో చావు తప్పదు. యుద్ధములోనున్న ప్రతి మనిషి తప్పక కదలి యుద్ధము చేయవలసి యుండును. అందువలన **'యుద్ధము'** అంటే 'కదలిక కలది' అని అర్థము కూడా కలదు. యుద్ధరంగములో ఒక్క క్షణము కూడా ఆగకుండా కదలుచుండవలెను. అదే విధముగా ఒక్క క్షణము కూడా ఆగకుండా ఆత్మ శరీరములో కదలికలను కల్గించుచున్నది. యుద్ధములో ఎన్నో విధముల కదలినట్లు, శరీరములో ఎన్నో కదలికల వలన మనిషి మనగలుగుచున్నాడు. రణము అనగా కదలిక కలదని అర్థము. అరణము అనగా కదలిక లేనిదని అర్థము. దీనిప్రకారము మరణము అనగా శరీరములో కదలికలు

లేని స్థితియని అర్థము. ఒక శరీరములో కదలికలు అన్నీ ఎప్పుడు ఆగిపోవునో అప్పుడు ఆ శరీరములోని ఆత్మ తన కదలికలను ఆపివేసి శరీరము బయటికి వచ్చినదని అర్థము. ఆత్మతోపాటు జీవాత్మ కూడా బయటికి ఎప్పుడు వస్తున్నదో అప్పుడు ఆత్మతోపాటు శరీరములోయున్న జీవాత్మ కూడా బయటికి ఎప్పుడు వస్తున్నదో అప్పుడు శరీరములోని కదలికలతో ఇక పనిలేదు. కదలికలు నిలిచిపోవడమే మరణమని అంటున్నాము. మరణమునకు వచనము, నిర్వచనము తెలిసిపోయినది. అయితే మరణములో మొత్తము నాలుగు తెగలు గలవు.

**ప్రశ్న :- ఇతిహాసమైన రామాయణములో గల ఆంజనేయుడు, మార్కండేయ పురాణములోగల మార్కండేయునికి మరణము రాలేదని వారు చిరంజీవులని కొందరు చెప్పుచున్నారు. అలా మరణము లేని జీవితముతో ఇంకా ఎవరయినా ఉన్నారా?**

**జవాబు :-** మరణము లేని జీవితమును గడుపువారు ప్రపంచములో ఎవరూ లేరు. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో సాంఖ్యయోగమున 27వ శ్లోకములో **"జాతస్య హిధృవో మృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ"** అని గలదు. దీనిఅర్థము **"పుట్టినవాడు చావక తప్పదు, చచ్చినవాడు పుట్టక తప్పదు"** అని చెప్పడమైనది. అంతేకాక ఇది అనివార్య కార్యమని కూడా చెప్పారు. ఇది బ్రహ్మవిద్యా శాస్త్రము నుండి చెప్పిన వాక్యమయినందున శాసనముగా తప్పక జరిగితీరునదిగా యున్నది. అందువలన ఎవడు ఎక్కడ పుట్టినా, ఎప్పుడు పుట్టినా, ఎక్కడో ఒకచోట, ఎప్పుడో ఒకప్పుడు శరీరమును వదలి చనిపోక తప్పదు. ఇది ఒక మనుషులకేకాక సర్వ జీవరాశులకు సంబంధించిన విషయమైనందున ఎవరు పుట్టినా తప్పక మరణించి తీరవలసిందే! దేవుడు ధర్మప్రచార నిమిత్తము శరీరము ధరించి పుట్టినా

ఆయన కూడా చనిపోవలసిందే!! గతములో అదే విధముగా జరిగింది. అటువంటప్పుడు ఆంజనేయుడు చిరంజీవి, చనిపోలేదు అనడము ధర్మ విరుద్ధమగును. ఎవరయినా కొంతకాలమునకు శరీరమును వదలి చనిపోవలసిందే. అలా చనిపోకుండా మిగిలిన వారు భూమిమీద ఎవరూ లేరు. మార్కండేయుని విషయానికి వస్తే అది ఒక పురాణగాథ. ప్రజలలో భక్తిని కల్గించుటకు చెప్పిన కల్పిత కథ. అందులోయున్న మార్కండేయుడు లేనే లేడు. అది చరిత్రకానేకాదు. కేవలము పురాణము మాత్రమే. అందువలన అది సత్యమైన మాటకాదు. ఇంతవరకు ప్రపంచములో పుట్టినవారు చనిపోకుండా సజీవముగా ఎవరూ లేరు. దేవుని శాసనము అందరికీ సమానముగా వర్తించును.

ప్రశ్న :- ఇందూ (హిందూ) మతములో భగవద్గీతను అనుసరించి చావు పుట్టుకలున్నాయని చెప్పుచున్నారు. హిందువులందరూ అదే భావములోనే యున్నారు. దానికి వ్యతిరేఖముగా ఎవరూ చెప్పలేరు. అయితే మిగతా రెండు సమాజములయిన క్రైస్తవులు, ముస్లీమ్‌లు చావు ఉన్నదిగానీ తిరిగి పుట్టుకలేదు అంటున్నారు. చనిపోయిన వాడు ప్రళయము వరకు భూసమాధిలోనే ఉండునని, ప్రళయ కాలములో చివరి దినమున అంతయూ నాశనమయిపోవు సమయములో అంతవరకు చనిపోయి సమాధులలో ఉన్న వారినందరినీ మూకుమ్మడిగా దేవుడు సమాధులనుండి బయటికి తీసి, వారి జీవితములలో వారు చేసుకొన్న పాపపుణ్యము లను లెక్కించి స్వర్గనరకములకు పంపును అని చెప్పుచున్నారు. ప్రళయ కాలమువరకు సమాధులలో యున్నవారందరూ ప్రళయము తర్వాత స్వర్గ నరకములకు పోవుదురని చెప్పడము భగవద్గీతలో దేవుడు చెప్పిన "చచ్చిన వాడు పుట్టక తప్పదు. పుట్టిన వాడు చావక తప్పదు" అను ధర్మమునకు విరుద్ధమగును. దీనిని గురించి మీరేమంటారు?

**జవాబు :-** దేవుడు ఒకమారు చెప్పిన జ్ఞానము శాసనముగా భూమిమీద నిలిచిపోవుచున్నది. అది ఎప్పటికీ మారునదికాదు. దేవుడు భూమిమీద ఒకే జ్ఞానమును మానవులందరికీ సమానముగా చెప్పాడుగానీ, హిందువులకు ఒక జ్ఞానమూ, ముస్లీమ్‌లకు మరొక జ్ఞానము చెప్పలేదు. దేవుడు తన జ్ఞానమును భూమిమీద ఒకే దైవగ్రంథముగా చెప్పాడు. ఆ గ్రంథమునే భారతదేశములో **భగవద్గీతయనీ** పడమటి దేశములలో **తౌరాత్‌యనీ** చెప్పుచున్నాము. దేవుడు చెప్పిన ఒకే దైవగ్రంథమును మనుషులు వేరువేరు కాగితములుగా చింపుకొని, వేరువేరు గ్రంథములుగా చెప్పుకొంటున్నారు. ఒకే దైవగ్రంథములోని ఒకే జ్ఞానమును ప్రజలు వేరువేరు భావములతో అర్థము చేసుకోవడము వలన, దైవగ్రంథములలో దేవుడు చెప్పని విషయమును కూడా చెప్పాడు అని అంటున్నారు. భగవద్గీతలో ఏ జ్ఞానమున్నదో అదే జ్ఞానమే మిగతా రెండు దైవగ్రంథములయిన బైబిలు, ఖురాన్‌లలో గలదు. అయినా మనుషుల శ్రద్ధనుబట్టి వారికి దేవుని జ్ఞానము అర్థము కావడము జరుగుచున్నది. మనిషి ఒక్కజాతే అయినప్పుడు దేవుడూ, దేవుడు చెప్పిన జ్ఞానము ఒక్కటే అయినప్పుడు, అందరికీ దేవుని జ్ఞానము సమానముగా చెప్పానని దేవుడే తన గ్రంథములలో ప్రకటించినప్పుడు, మరి దానిని ఒకే విధముగా అర్థము చేసుకోవలసియున్నా, తనకున్న సంకుచిత భావముల చేత వేరువేరుగా భావించుకొన్న మనిషి తనకు తెలిసినదే నిజమైన జ్ఞానమని అనుకొంటున్నాడు. దేవుడు మనిషి చనిపోవునని చెప్పాడు, తిరిగి పుట్టునని చెప్పాడు. అయినా కొందరు తమకర్థమైనదే నిజమనుకొని, తమను అనుసరించు తమ సమాజమున కంతటికీ చెప్పడము వలన, మిగతా సమాజము వారంతా తమ మతపెద్ద చెప్పిన జ్ఞానమునుబట్టి అనుసరించడము వలన, ఒక సమాజములో యున్న భావము మరొక సమాజములో లేకుండాపోయి, నీది వేరు జ్ఞానము నాది

వేరు జ్ఞానము, నా దేవుడు వేరు నీ దేవుడు వేరను స్థితిలోయున్నారు. అందువలన భగవద్గీతలో చెప్పినది వేరు, ఖురాన్‌లో, బైబిల్‌లో చెప్పినది వేరు అంటున్నారు. వాస్తవానికి మిగతా రెండు గ్రంథములలో యున్న జ్ఞానమే మొదటి గ్రంథమయిన భగవద్గీతలో (తౌరాత్‌లో) గలదు.

**ప్రశ్న :- అయితే మిగతా గ్రంథములలో చెప్పినట్లు జన్మలు లేవు అనడము అసత్యము అంటారా?**

**జవాబు :-** మిగతా గ్రంథములలో అసత్యము ఎక్కడాలేదు. దైవ వచనములు ఏవయితే ఉన్నాయో అవి అన్నియూ సత్యమైనవే. అయితే వాటిని మనుషులు నిజమైన భావముతో అర్థము చేసుకోలేదు. అందువలన ఒకే విషయమే హిందువులకు ఒకరకము, ముస్లీమ్‌లకు మరొక రకముగా అర్థమయినది. భగవద్గీతలో వ్రాయబడిన భావమే ఖురాన్‌లో కలదు. కావుననే ఖురాన్ గ్రంథములో ఐదవ సూరాలోనూ, మిగతా సూరాలలోనూ తౌరాత్ గ్రంథము లోని జ్ఞానమునే సమర్థించునట్లు, ధృవీకరించునట్లు చెప్పారు. భగవద్గీత (తౌరాత్) గ్రంథములోని జ్ఞానమును ఖురాన్ **"నేను ధృవీకరిస్తున్నాను"** అని చెప్పినా మనిషి గ్రహించుకొను స్థితిలో లేకుండా, మా జ్ఞానము వేరు మీ జ్ఞానము వేరని మాట్లాడుచున్నారు. దేవుడు తన గ్రంథములలో **"సమస్త మానవులకు నేను జ్ఞానమును ఇచ్చుచున్నాను"** అని అన్నాడు. ఆ మాటను తమ బైబిల్, ఖురాన్ గ్రంథములలో చదివినా అర్థము చేసుకోని మనుషులు మా దేవుడు వేరు మీ దేవుడు వేరు అని అంటున్నారు.

**ప్రశ్న :- మీరు ఇంతకుముందు చెప్పిన జవాబులలో భగవద్గీతను వేరువేరు కాగితములుగా చింపుకొని, వాటినే వేరువేరు గ్రంథాలుగా చెప్పుకొనుచూ, వేరువేరు జ్ఞానముగా చెప్పుచున్నారని అన్నారు. మీ మాట సత్యమంటారా? నమ్మమంటారా?**

**జవాబు :-** నా మాటను మీరు నమ్మాలి అని నేను చెప్పడములేదు. నేను దైవగ్రంథములో శాస్త్రబద్ధముగాయున్న విషయమునే చెప్పుచున్నాను. దానికి ఆధారము కావాలంటే అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో ఆరవ సూరా, 91వ ఆయత్‌నందు ఇలా కలదు చూడండి. **(6-91) "అల్లాహ్ ఏ మానవుని మీద తన జ్ఞానమును అవతరింపజేయలేదు అని పలికినప్పుడు ఈ జనులు అల్లాహ్‌ను అర్థము చేసుకోవలసిన విధముగా అర్థము చేసుకోలేదు. వారిని అడుగు! మూసా తెచ్చిన గ్రంథాన్ని ఎవరు అవతరింపజేసినట్లు? ఆ గ్రంథము ఒక జ్యోతి, మానవుల కొరకు మార్గదర్శకత్వము. మీరు దానిని వేరువేరు కాగితములుగా విభజించి చూపుతున్నారు. ఎన్నో విషయాలను దాచేస్తున్నారు. మీకుగానీ, మీ పెద్దలకుగానీ తెలియని ఎన్నో విషయాలు ఇందుమూలముగా మీకు నేర్పబడ్డాయి. దానిని అవతరింప జేసినవాడు అల్లాహ్‌యే అని చెప్పు. ఆ తర్వాత వాళ్ళను వారి వ్యర్థ విషయాలలోనే ఆడుకోనివ్వు"** ఈ వాక్యములో అల్లాహ్ ఇచ్చిన తౌరాత్ (భగవద్గీత)ను వేరువేరు కాగితములుగా విభజించి చూపుతున్నారు అని కలదు కదా! వేరువేరు కాగితములు అనగా వేరువేరు గ్రంథములని అర్థము చేసుకోవలెను. తౌరాత్ గ్రంథమే భగవద్గీత గ్రంథము. వేరువేరు కాగితములే వేరువేరు గ్రంథములయిన బైబిలు, ఖురాన్ అని అర్థము చేసుకోవలెను. తౌరాత్ నుండి విభజింపబడిన గ్రంథములు బైబిలు, ఖురానే అనుటకు భగవద్గీతలో గల జ్ఞానము రెండు గ్రంథములలో కలదు. రెండు గ్రంథములలోని జ్ఞానమే తౌరాతు (భగవద్గీత) లో కూడా కలదు. ఇంతకంటే సాక్ష్యము అవసరము లేదు.

ప్రశ్న :- మరణించిన మనిషి భూసమాధిలో ప్రళయము జరుగువరకు ఉంటాడనీ, ప్రళయములో అంతా నాశనమయిపోవు చివరి దినములో

**భూసమాధి నుండి బయటికి అల్లాహ్ లేపు వరకు అక్కడే సమాధిలోనే చనిపోయిన వాడు ఉంటాడు అని ముస్లీమ్‌లు చెప్పుచున్నారు. అదే సత్యమని, తమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో ఈ విషయమును చెప్పారని ముస్లీమ్‌లు అంటున్నారు. వారిమాట సత్యము కాదా?**

**జవాబు :-** ఖురాన్‌లో చెప్పినమాట వాస్తవమే. అయితే దేవుడు చెప్పిన మాటను ఎలా అవగాహన చేసుకోవాలో అలా మనము అర్థము చేసుకోలేదు. గ్రంథములో 'ప్రళయము' అనుమాట ఉన్నది నిజమే. అయితే ప్రళయమంటే ఏమిటో? ఎవరికీ తెలియదు. అలాగే గ్రంథములో 'అంత్యదినము' అని గలదు. అయితే అంత్యదినమని అంటే ఏమిటో? ఎవరికీ తెలియదు. అందువలన తప్పు భావములోనికి పోవు అవకాశము గలదు. దైవ గ్రంథమయిన ఖురాన్‌లో 'సమాధి' అని గలదు. అయితే సమాధి అంటే ఏమిటో? దాని నిజభావము మాత్రము ఎవరికీ తెలియదు. ఇట్లు గ్రంథములో గల పదములకు అర్థము తెలియని దానివలన, వాటి యొక్క నిజ భావము తెలియకుండా పోయి అసలయిన సత్యము మరుగున పడిపోయి, అసత్యమే ప్రచారమయినది. దానివలన మనిషి తప్పుదారి పట్టిపోయాడు.

ఇక్కడ ప్రళయము అంటే పుట్టినదంతా నాశనమగుటయని అందరికీ తెలుసు. అలాగే అంత్యదినము అంటే ప్రపంచమునకు చివరి రోజు అని సర్వసాధారణముగా అందరు అనుకోవడము జరుగుచున్నది. ఇకపోతే సమాధి అంటే అందరి దృష్టి భూసమాధి వైపే పోవుట వలన అందరూ సమాధి అంటే శవమును పూడ్చిపెట్టిన గుంతయే అను కొంటున్నారు. అందువలన ఖురాన్‌లో దేవుడు చెప్పినది ఒక జ్ఞానమైతే మనుషులకు అర్థమయినది మరొక జ్ఞానమయినది. ఈ విషయములో

పూర్తి అవగాహనా లోపము ఏర్పడినది. ఖురాన్‌గ్రంథములో స్థూలజ్ఞానము కొంత సూక్ష్మ జ్ఞానము కొంత కలదని చెప్పారు. **స్థూల జ్ఞానమును ముహ్కమాత్, సూక్ష్మ జ్ఞానమును ముతషాబిహాత్ వాక్యములని సూరా 3, ఆయత్ 7లో చెప్పడమైనది.** ఇక్కడ ప్రళయమనినా, అంతిమ దినమనినా, సమాధి అనినా స్థూలమైన అర్థమును తీసుకోకూడదు. సూక్ష్మమైన అర్థమును తీసుకోవలసిన అవసరమున్నది. స్థూల అర్థముతో అక్కడ చెప్పలేదు. స్థూల అర్థముతో చెప్పుకొంటే అది ప్రపంచ ప్రళయమగును. దేవుడు ప్రపంచ ప్రళయమును గురించి అక్కడ చెప్పలేదు. మనిషి శరీరములో జరుగు ప్రళయమును గురించి చెప్పాడు. ప్రపంచ ప్రళయము ఎప్పటికీ జరుగదు. శరీరము లోపల ప్రళయము జరిగి శరీరము నాశనము కావడము అగుచున్నది. ఎప్పుడు శరీరము నాశనమయి జీవునికి నివాస యోగ్యము కాకపోతే, అప్పుడు శరీరములోని జీవుడు (జీవాత్మ) శరీరమును వదలి బయటికి రావలసి వచ్చును. జీవాత్మతోపాటు ఆత్మకూడ బయటికి వచ్చును. ఆత్మ, జీవాత్మ రెండు జోడు ఆత్మలయిన దానివలన ఒకేమారు రెండూ బయటికి వస్తున్నవి. అంతవరకు శరీరముతో సంబంధమున్న జీవాత్మకు శరీరముతో ఎటువంటి సంబంధము లేకుండా పోవును. ఒకదానితో మరొకటి ఎప్పటికీ విడిపోకుండా జోడు ఆత్మలుగా జీవాత్మ, ఆత్మ రెండూ అంటిపెట్టుకొని ఉండును. వివరముగా చెప్పాలంటే ఆత్మ ఆధీనములో, ఆత్మ ఆవరణములో జీవాత్మ బంధింపబడియుండును. బాకీ ఇచ్చిన వాని చేతిలో బాకీయున్న వాడు ఉన్నట్లు ఆత్మ ఆధీనములో జీవుడు ఉండును. దీనినిబట్టి జీవుడు (జీవాత్మ) ఎన్నటికీ స్వతంత్రుడు కాదని నిరూపణగా తెలియుచున్నది.

ఉదాహరణగా ఒక విషయమును గమనిద్దాము. ఒక యజమాని మరొక వ్యక్తికి లక్షరూపాయల డబ్బును అప్పుగా ఇచ్చాడనుకొనుము. అప్పుగాయున్న లక్షరూపాయలు తీరిపోవువరకు బాకీయున్నవాడు బాకీ ఇచ్చినవాని చేతిలో ఉండవలసిందే అను నియమము కలదు. బాకీ తీసుకొన్నప్పుడు చేసుకొన్న నియమము ప్రకారము బాకీ చేసినవాడు, బాకీ ఇచ్చిన వాని మాట ప్రకారము నడువవలసిందే. ఒకవేళ తొందరగా బాకీయున్నవాడు బాకీ తీర్చగలిగితే ఫరవాలేదు. అప్పు ఇచ్చిన వాని ఆధీనమునుండి బయటపడి స్వతంత్రునిగా ఉండిపోవచ్చును. తీర్చ లేకపోతే తీర్చేవరకు బాకీ ఇచ్చిన వాని చేతిలో కీలుబొమ్మగా ఉండవలసిందే. మొదట పది రూపాయల బాకీతో మొదలుపెట్టి దానిని తీర్చలేక దానికి తోడు ఇంకా కొంత అప్పు చేయుచూ పది రూపాయలనుండి నూర్లు, వేలు, లక్షలవరకు పెంచుతూ పోతే అప్పు పెరిగిపోవడము తప్ప తరగడము అనేది ఉండదు. అటువంటి వానికి బాకీ ఇచ్చినవాని చేతినుండి బయటపడు అవకాశమే లేదు. అందువలన వాడు ఎప్పటికీ బాకీదారునిగా, ఎంత కష్టపడినా బాకీ తీరక అప్పు ఇచ్చిన వాని ఆధీనములో ఉండవలసిందే. అట్లుకాక ఉన్న అప్పు గురించి యోచించినవాడై, తెలియక చేసిన అప్పు ఎంతవున్నా దానిని తీర్చుకొను ఉపాయమును వెదకితే దారి దొరుకును. ఆ దారి ప్రకారము తొందరగా బయటపడ వచ్చును. ఎంతోకాలమునుండి అప్పు చేయుచూ వచ్చువానికి ఉన్నట్లుండి అప్పు తీర్చు దారి ఎట్లు దొరుకునని ప్రశ్నరావచ్చును. దానికి జవాబు ఏమనగా! అప్పు చేయువానికి అప్పు తీర్చు దారి తెలియకనే ప్రతి సంవత్సరము అప్పును పెంచుకొనుచూ పోవుచున్నాడు. అందువలన అప్పు చేసినవాడు, అప్పు ఇచ్చిన వాని సలహాను అనుసరిస్తే సులభముగా అప్పు తీర్చుకోగలడు. అప్పు ఇచ్చినవాడు కూడా తన అప్పును తీర్చు ఉపాయమును అప్పు ఇచ్చినప్పుడే చెప్పి

యున్నాడు. అయితే అప్పు తీసుకొన్న వాడు నేను బాకీయున్నాను అనుమాటే మరచిపోయాడు. బాకీ విషయమే మరచిన వాడు బాకీ ఇచ్చిన వానిని పూర్తిగా మరచిపోయాడు.

బాకీ ఇచ్చినవాడు బాకీ తీసుకొన్నవానికి బాకీ ఇచ్చినప్పుడే ఒక మాటను చెప్పాడు. "నీకు నేను పది రూపాయలు అప్పు ఇస్తున్నాను. పది రూపాయలు తీరిపోవుటకు పదిరోజులు ఊరకవుండు. ఊరకవున్నా నీ బాకీ తీరిపోతుంది" అని చెప్పాడు. ఇచ్చిన వాడు తీసుకొన్నవానిమీద దయతలచి, పది రోజులు ఊరకుంటే చాలని చెప్పాడు. అంత సులభముగా అప్పు తీరిపోవు ఉపాయమును చెప్పితే వానిమాటను నేనెందుకు వినాలని, నేనే అతనికంటే తెలివైనవానినని అనుకోవడము వలన ఇచ్చిన ఆయన చెప్పినట్లు తీసుకొన్నవాడు వినలేదు. ఆ అప్పు తీరలేదు. నేను కష్టపడి తీర్చుతానని అనుకొనినా, ఎంత కష్టపడినా ఆ అప్పు తీరకపోగా ఇంకా పెరుగుచూనే వస్తున్నది. ఇప్పటికయినా అప్పు ఇచ్చిన వానిని మరచి పోకుండా అతనిని గుర్తుంచుకొని, ఆయన మాట ప్రకారము ఒక రూపాయకు ఒక దినము ఊరకనే వుంటే అప్పు తీరిపోవును కదా! మొదట తీసుకొన్నప్పుడు పది రూపాయలే నిజమైన అప్పు. అయితే అది పెరుగుతూ వచ్చి నేడు కొన్నివేలు, లక్షలు, కోట్ల వరకు పోయినది. వారివారి పనులనుబట్టి వారివారి బాకీ పెరిగినది. ఇప్పటికయినా వేయి రూపాయలు అప్పు పడినవాడు వేయి దినములు మానసికముగా, శారీరకముగా ఏ పని చేయకుండా ఊరకుంటే అప్పు తీరిపోవును. వేయి రూపాయల బాకీకి దాదాపు వేయి దినములు అనగా రెండు సంవత్సరముల, తొమ్మిది నెలల, ఒక దినమగుచున్నది. ఈ విధముగా ఎంత బాకీ ఎక్కువగా ఉంటే అంత ఎక్కువ కాలము పట్టుచున్నది. ఒక్కమారు బాకీ తీరిపోతే, బాకీ

ఇచ్చిన వానితో సంబంధము లేకుండాపోవును. అప్పు తీరనంతవరకు బాకీ ఇచ్చిన వాని చేతిలో 'అప్పు' అనే తాడుచేత బంధింపబడియుండ వలసిందే. అప్పు తీసుకొన్న నియమము ప్రకారము, అప్పు ఇచ్చిన వాడు ఎక్కడికి పోతే అప్పు తీసుకొన్నవాడు వానివెంట అక్కడికి పోవలసిందే! అంతేకాక వాని ఇష్టమొచ్చిన పనిని చేయించి వానికిష్టమొచ్చిన దానిని ఇస్తే, దానినే తిని కాలము గడుపవలసిందే! అప్పు తీరనంతవరకు అప్పు తీసుకొన్నవానికి స్వతంత్రత ఏమీ ఉండదు. ఇంతవరకు వినిన దానినిబట్టి అప్పు ఇచ్చిన వానిని గురించి, అలాగే అప్పు తీసుకొన్నవానిని గురించి వివరముగా తెలిసిపోయినది కదా! వీరి ఇరువురి సంబంధము ఎలా ఉన్నదో, అలాగే శరీరములో ఆత్మ, జీవాత్మ యొక్క సంబంధము కలదు. వారి ఇరువురి సంబంధమును వివరించితే ఇలా కలదు చూడండి.

ఇది అంతయూ ఒక జరిగిన కథలాగయున్నా వాస్తవానికి ఇది అందరి శరీరములలోనూ ఎల్లప్పుడూ జరుగుచున్న యదార్థగాథగా యున్నది. ఇది ఎవరికో సంబంధించిన విషయముగా చూడకుండా తన స్వయం విషయముగా ప్రతి ఒక్కరూ గమనించవలెను. నీవు ఒక శరీరమును ధరించి ఆ శరీరములో నివసించుచున్నావు. నీవు జీవాత్మయను పేరుతో శరీరములో ఉన్నావు. పైన నీ శరీరమునకు ఒక గుర్తింపు పేరు రాముడనో, రంగడనో, రావు అనో, గౌడు అనో యున్నా, నీవు మాత్రము జీవాత్మవే. బయట పేర్లన్నీ నీ శరీరమునకు గుర్తింపుగా పెట్టుకొన్నవే తప్ప వాస్తవముగా అది నీపేరు కాదు. నీవు శరీరములో ఎంత కాలమున్నా అంత కాలము నీవు జీవాత్మవే! శరీరములో కళ్ళ ద్వారా ముందుకే చూస్తున్నాము. ఎవరు కూడా వెనక్కు చూచుకోవడము లేదు. ఎవడయినా వెనక్కి తిరిగి చూచుకొంటే తన వెనుక మరొకడు ఉన్నాడని తెలియును. ఎవడు వెను

తిరిగి చూచుకొన్నా, చూచుకోకపోయినా వాస్తవముగా వాని వెనుక మరొకడు గలడు. వాడే కథలో అప్పు ఇచ్చినవాడున్నట్లు మన శరీరములో మనకు అప్పు ఇచ్చినవాడుగా ఉన్నాడు. అప్పు తీసుకొన్న వానిపేరు జీవాత్మ అయితే, అప్పు ఇచ్చినవానిపేరు ఆత్మగానే ఉన్నది. కథలో మొదట పది రూపాయలు అప్పు తీసుకొన్నట్లు, మొదట సృష్ట్యాదిలో పది రోజులకు సరిపడు 'కర్మ' అనే దానిని అప్పుగా పొందడమైనది. కథలోయున్నవాడు పది రూపాయల డబ్బును ఇస్తే, శరీరములో యున్నవాడు డబ్బు బదులు కర్మను అప్పుగా ఇచ్చాడు. కథలో అప్పు ఇచ్చినవాడే తన అప్పు తీరిపోవు ఉపాయమును చెప్పినట్లు, మొదట కర్మను అంటగట్టినవాడే ఆ కర్మ తీరిపోవు విధానమును కూడా చెప్పాడు. ఆ విధానమే యోగమునకు సంబంధించిన జ్ఞానమని తెలియుచున్నది. సృష్ట్యాదిలో కర్మను కట్టి జీవునకు ఇచ్చినవాడే ఆ కర్మ తీరిపోవుటకు కథలో చెప్పినట్లే మానసికముగాగానీ, శారీరకముగా గానీ ఏమీ చేయక పది రోజులున్నా తీరిపోవునని కూడా చెప్పాడు. ఆ విధానమునకే "యోగము" అని పేరు పెట్టాడు. శారీరకముగా ఏ పనినీ చేయకుండా ఉండడమును **బ్రహ్మయోగమనీ,** శారీరకముగా చేసినా చేయక పోయినా మానసికముగా చేయకపోవడమును **కర్మయోగమని** కూడా చెప్పాడు.

ఆత్మ బోధించిన ఆ రెండు విధానములను మనిషి మరచిపోయినా, నేడు దైవగ్రంథములో అందరికీ తెలియునట్లు వ్రాసిపెట్టబడియున్నది. అయినా మనిషి దైవగ్రంథములను చూడకుండా ఉన్నాడు. ఒకవేళ చూచినా అందులో చెప్పిన విధానమును గ్రహించలేకయున్నాడు. అందువలన నిజ జీవితములో కర్మ అను అప్పును జయించగల లేక తీర్చగల విధానమును తెలియక ఎప్పటికీ ఆత్మకు బాకీదారునిగానే నిలిచిపోయాడు. కర్మ అనే

బాకీ తీరనంతవరకు నియమము ప్రకారము ఆత్మ ఎక్కడికిపోతే జీవాత్మ కూడా అక్కడికి పోవలసిందే. కథలో చెప్పినట్లు ఆత్మ ఎలా ఆడిస్తే అలా జీవుడు ఆడవలసిందే. అలాగే ఏమి ఇస్తే దానినే తినవలసిందే లేక అనుభవించవలసిందే. కర్మ తీరునంతవరకు జీవుని ఇష్టము ప్రకారము ఏదీ జరుగదు. అంతా ఆత్మ ఇష్టము ప్రకారమే జరుగును. జీవునికి కర్మ అనే అప్పు తీరనంతవరకు స్వతంత్రముండదు అనగా మోక్షముండదు.

జీవుని కర్మ అను అప్పు తీరనంతవరకు ఆత్మ తానువున్న శరీరమును వదలి ఏ శరీరమును చేరునో, జీవుడు కూడా ఆత్మవెంట ప్రయాణిస్తూ ఆత్మ వదలిన శరీరమును వదలి, ఆత్మ చేరిన శరీరములోనికే చేరుచున్నాడు. ఆత్మ 'కర్మ' అను బాకీచేత జీవాత్మను తన ఆధీనములో ఉంచుకొని ఉండుట వలన ఆత్మ ఎక్కడికి పోవునో, ఆత్మ వెంట అక్కడికి జీవాత్మ కూడా పోవలసి యున్నది. ఈ విధానమంతయూ సృష్ట్యాదిలోనే ధర్మయుక్తముగా ఏర్పరచబడి యున్నది. ఆత్మ వెంట జీవాత్మ పోవుట వలన ఈ రెండు ఆత్మలను జోడు ఆత్మలని అంటున్నాము. ఒకవేళ జీవాత్మ వెంట ఆత్మపోయినా, ఆత్మవెంట జీవాత్మ పోయినా దానిని మరణము అంటున్నాము. శరీరమును విడచి ఆత్మవెంట జీవాత్మ పోతే దానిని **'కాలమరణము'** అంటున్నాము. ఎప్పుడయినా ఒకప్పుడు శరీరమును వదలి జీవాత్మ ముందు పోయినా, దాని వెనుక ఆత్మపోయినా అదియూ మరణమే అయినా, దానిని ప్రత్యేకించి **'అకాల మరణము'** అంటున్నాము. కాల మరణమునకు అకాల మరణమునకు కొంత తేడాయున్నది. అది ఆత్మ జీవాత్మల గమనమునుబట్టి వుండును. శరీరమునుండి ముందు ఆత్మవచ్చి దానివెంట జీవాత్మవస్తే దానిని కాలమరణమనీ, అట్లే ముందు జీవాత్మ వచ్చి దానివెంట ఆత్మవస్తే దానిని అకాల మరణమనీ చెప్పవచ్చును.

అయితే నేడు ఏది కాలమరణమో, ఏది అకాల మరణమో ఎవరూ చెప్పలేక పోవుచున్నారు.

అకాల మరణము యొక్క విషయము తర్వాత వివరించుకొందాము. ఇప్పుడు కాలమరణము యొక్క పూర్తి విషయమును తెలుసుకొందాము. జననముతో మనిషి జీవితము మొదలగుచున్నది. అలాగే మరణముతో మనిషి జీవితము ముగియుచున్నది. జనన మరణ మధ్య కాలమును జీవితము అంటున్నాము. జీవితమునకు మొదలు అంత్యములు రెండూ మనిషి జీవితమునకు రెండు హద్దులలాంటివి. రెండు హద్దుల మధ్యలో జీవితము సాగుచున్నది. శరీరములోనికి ఆత్మ, ఆత్మతోపాటు జీవుడు ప్రవేశించడమును జననము లేక జన్మ అంటున్నాము. ఆత్మ ఎక్కడికి పోవునో అక్కడికి జీవాత్మ పోవడము సహజసిద్ధము. ఎందుకనగా రెండు ఆత్మలు జోడు ఆత్మలుగాయున్నవి. మనిషి బయట ప్రపంచములో హిందువుగా అయినా ఉండవచ్చును, ముస్లీమ్‌గా అయినా ఉండవచ్చును లేక క్రైస్తవుడుగా అయినా ఉండవచ్చును. బయట ఏ మతములోయున్న వానికయినా శరీర యంత్రాంగమంతయూ ఒకే విధముగా ఉండును. బయటి శరీరమంతయూ కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములను పది ఇంద్రియములతో కూడుకొన్నదై, లోపలి యంత్రాంగమంతయూ జీవునితో సహా పదిహేను భాగముల నిర్మాణమై, మొత్తము 25 భాగముల శరీర నిర్మాణము అందరికీ కలదు. అన్ని మానవ శరీరములు ఒకే ధర్మమును, ఒకే విధానమును కల్గియున్నవి. అందువలన చావుగానీ, పుట్టుకగానీ అందరికీ సమాన అనుభవముగాయున్నది. ఒకనికి మరణము ఎలా కల్గుచున్నదో మిగతా మనుషులకందరికీ అదే విధముగా మరణము కల్గుచున్నది. సర్వ మానవులకు దేవుడు ఒక్కడే అయినందున అందరికీ

చావుపుట్టుకలు కూడా ఒకే రకముగా ఉన్నవి. జనన మరణములు రెండు ఎప్పటికీ మారని సిద్ధాంతరూపముగా ఉన్నవి.

మనిషి శరీరములో 24 భాగములు ప్రకృతి సంబంధముగా ఉండగా, 25వ భాగము ఆత్మ సంబంధమైన జీవునిగా ఉన్నాడు. 24 భాగములు ప్రకృతితో తయారైవుండగా, జీవుడు ఆత్మ సంబంధముగా వున్నాడు. జీవునితో పాటు ఆత్మ కూడా కలదు. ఆత్మయే కాకుండా పరమాత్మ కూడా శరీరములోనే కలదు. ఈ ప్రకారము మూడు ఆత్మలు, 24 ప్రకృతి భాగములు మొత్తము 27 భాగములుగా శరీరమున్నది. అయితే ప్రకృతి గుణములలో జీవుడు ఉండుట వలన మరియు కర్మతో బంధింపబడి దాని ప్రభావములో జీవుడు గుణచక్రములో బందీగా ఉండుట వలన అతనిని శరీర భాగముగా లెక్కించవలసి వచ్చినది. మిగతా ఆత్మ, పరమాత్మలు రెండు ఒకచోట లేనివై ఒక భాగము కానివై శరీరమంతా వ్యాపించియుండుట వలన ఆ రెండింటినీ శరీర భాగములుగా లెక్కించడము లేదు. దీనిప్రకారము మూడు ఆత్మలలో ఒక జీవాత్మ శరీర భాగములలోనికి చేరిపోయి శరీర భాగములు మొత్తము 25గా చెప్పబడుచున్నవి. మిగతా ఆత్మ పరమాత్మలు రెండు శరీరమునకు అతీతముగాయున్న వాటిగా లెక్కించుచున్నాము. ఏమాత్రము ప్రకృతితో సంబంధము లేకుండా ఉండుట వలన రెండు ఆత్మలను పవిత్ర ఆత్మలుగా చెప్పవచ్చును. అంతేకాక ఆత్మ శరీరమంతా వ్యాపించియుండుట వలన మరియు పరమాత్మ శరీరము లోపల, శరీరము బయట అంతటా అణువణువునా వ్యాపించియుండుట వలన శరీరము లోపల దేవుడు ఆత్మయనీ, శరీరము బయటి దేవుడు పరమాత్మయనీ చెప్పవచ్చును. అంతేకాక చరప్రకృతికి దేవుడు ఆత్మయనీ, అచర ప్రకృతికి దేవుడు పరమాత్మయనీ చెప్పవచ్చును. ప్రపంచమంతా

ఆవహించి శరీరములను కూడా తనయందే ఇముడ్చుకొన్న పరమాత్మ పెద్ద దేవునిగా చెప్పవచ్చును. శరీరములో మాత్రము ఆవహించిన ఆత్మను చిన్న దేవునిగా చెప్పవచ్చును. మొత్తము ప్రకృతియంతా ఆవహించి, జీవాత్మ ఆత్మలకు కూడా అధిపతియై, వారియందు కూడా కల పరమాత్మయను దేవుడు అందరికంటే పెద్ద, కావున ఆయనను "బ్రహ్మ" అని అన్నారు. బ్రహ్మ అనగా పెద్ద అని అర్థము. బ్రహ్మ అంటే విష్ణు, ఈశ్వర, బ్రహ్మ అను మూడు పేర్లుగల త్రిమూర్తులలోని బ్రహ్మ అందరికీ గుర్తు రావచ్చును. అయితే త్రిమూర్తులలోని బ్రహ్మవేరు, పరమాత్మగా చెప్పబడు బ్రహ్మవేరని తెలియవలెను. ప్రపంచములో ఆయనకంటే మించిన వాడు లేడు, కనుక ఆయనే పెద్దగా చెప్పడము జరిగినది. శరీరములో అంతటా వ్యాపించిన ఆత్మ శరీరములో దేవునిగా లెక్కించబడినా ఆత్మకు "బ్రహ్మ" అను పేరు లేదు.

జీవాత్మకు ఆత్మతో తప్ప పరమాత్మతో సంబంధములేదు. పరమాత్మకు ఆత్మతో తప్ప జీవాత్మతో సంబంధము లేదు. అయితే ఆత్మకు మాత్రము ఇటు జీవాత్మతోనూ, అటు పరమాత్మతోనూ రెండువైపులా సంబంధముండును. జీవాత్మకు పరమాత్మకు మధ్యలో అనుసంధానకర్తగా మధ్యవర్తిగా ఆత్మగలదు. జీవాత్మ దేవుడయిన పరమాత్మను చేరాలంటే ఆత్మ ద్వారానే చేరవలసియున్నది. అందువలన ఒక దైవగ్రంథములో **"నా ద్వారా తప్ప ఎవడూ దేవునివద్దకు పోలేడు"** అని చెప్పాడు. జీవాత్మకు ఆత్మ తండ్రికాగా, ఆత్మకు పరమాత్మ తండ్రిగా చెప్పబడుచున్నాడు. అందువలన మధ్య దైవగ్రంథములో ఆత్మ ఇలా చెప్పింది **"నేను నా తండ్రి ఏకమైయున్నాము".** ఆత్మ శరీరమంతా వ్యాపించియుండగా, పరమాత్మ కూడా శరీరమంతా వ్యాపించియుండుట వలన **"నేను నాతండ్రియైన**

**పరమాత్మలో కలిసియున్నానని"** ఆత్మ చెప్పడము జరిగినది. కనిపించే మనిషి ఆ మాట చెప్పినా, ఆ మాట ఆత్మ చెప్పినదని అర్థమగుచున్నది. జీవునకు శరీరములో గల ఆత్మయే దేవుడు. జీవుడు శరీరములోనే ఉన్నాడు, శరీరములో ఉంటూ ఆత్మతో సంబంధపడియున్నాడు. జీవునికి పరమాత్మతో ఎటువంటి సంబంధములేదు. జీవున్ని ఆడించువాడు, అనుభవింపజేయువాడు, ఇతర శరీరములలో జన్మింపజేయువాడు అన్నియూ ఆత్మయే. అంతేకాక జీవున్ని దేవునియొద్దకు చేర్చి మోక్షమును కల్గించు వాడు కూడా ఆత్మయే. అందువలన ప్రపంచముకంతటికీ పెద్ద అయిన దేవునిగా యున్న పరమాత్మతో జీవునకు ఏ సంబంధములేదు. జీవుడు ఆత్మతోనే సంబంధము కల్గియుండుట వలన **జీవునికి ఆత్మయే దేవుడు, ఆత్మయే మార్గము, ఆత్మయే గమ్యము.** అందువలన మధ్య దైవగ్రంథములో ఆత్మ **"నేనే మార్గము, నేనే గమ్యము"** అని చెప్పింది. ఈ విధముగా అంతయూ గమనిస్తే శరీరములో జీవుని యొక్క స్థితి ఏమిటి? అని తెలియగలదు. అంతేకాక కర్మకు అతీతముగా ప్రకృతికి అతీతముగాయున్న ఆత్మ పరమాత్మల విషయము కూడా కొంత అవగాహనకు రాగలదు.

శరీరములో జీవాత్మకు గతిగా, భర్తగా అన్నియూ తానైయున్న ఆత్మ జీవునికి యమునిగా కూడా కలదు. కర్మకు తగిన శిక్షను జీవునికి విధించడమే కాక, ఒక శరీరములో ప్రారబ్ధకర్మ అయిపోయిన వెంటనే జీవున్ని మరణము పొందునట్లు చేసి రెండవ జన్మకు తీసుకొని పోవుచున్నది. జీవున్ని శరీరమునుండి ఆత్మ తనవెంట శరీరము బయటికి తెచ్చుకోవడము మరణముకాగా, బయటికి తెచ్చిన జీవున్ని మరుజన్మకు తీసుకొని పోవుటను జననము అంటున్నాము. జననము ప్రతి జీవికి ఏమాత్రము ఆలస్యము లేకుండా జరుగుచున్నది. ఒక మనిషి చనిపోయిన క్షణమే శరీరములోని

జీవున్ని ఆత్మ తనవెంట తీసుకొనిపోయి వేరే శరీరములో ప్రవేశించుచున్నది. అలా ఆలస్యము లేకుండా మరణము వెంటనే జననము జరుగుచున్నా అది ఎవరికీ కనిపించు విషయము కాదు, కావున ఆ విషయము ఎవరికీ తెలియకుండా పోయినది. ఆత్మ శరీరమునకంతటికీ అధిపతిగాయున్నది. కావున శరీరములోని జీవునికి కూడా దేవునిగాయున్నది. ఆత్మ శరీరము నుండి ఎప్పుడు బయటికి వచ్చినదో, అప్పుడే జీవుడు బయటికి వచ్చుట వలన అది మృతదేహమై పోయినది. ఆత్మ, జీవాత్మ రెండు శరీరమును వదలి బయటికి రాగా, మూడవదయిన పరమాత్మ అంతటా వ్యాపించియున్న వాడైనందున ఆయన (దేవుడు) చనిపోయిన శరీరములో కూడా కలడు. మూడు ఆత్మలలో రెండు ఆత్మలు శరీరమును వదలగా, ప్రపంచమున కంతటికీ దేవుడైన పరమాత్మ ఎక్కడికీ పోనివాడై, అంతటాయున్నవాడై శరీరములో నిలిచిపోయాడు. శరీరమునకు అధిపతి, శరీరమును రక్షించువాడు అయిన ఆత్మ లేనిదానివలన శరీరము నాశనమగుటకు ప్రారంభించును. మనిషి చనిపోయిన తర్వాత శరీరము కుళ్ళిపోవుటకు, చెడిపోవుటకు మొదలుపెట్టును. కావున చనిపోయిన మనిషి శరీరమును కాల్చివేయడమో పూడ్చివేయడమో జరుగుచున్నది. ఆర్థికస్థోమతయున్నవారు డబ్బులు ఖర్చుచేసి మృత శరీరమును కాల్చివేయగా, డబ్బులు లేనివారు మట్టిలో పూడ్చిపెట్టడము జరుగుచున్నది.

మనిషి చనిపోయిన తర్వాత మృత శరీరములో మొదట చెడిపోయి కుళ్ళుటకు ప్రారంభించునవి కడుపులోని ప్రేగులు. అందువలన చనిపోయిన శరీరము కొన్ని గంటలకే దుర్వాసన రావడము మొదలిడును. దానినే చనిపోయిన శరీరమును ఎంత వీలయితే అంత తొందరగా పాతిపెట్టుటకో, కాల్చివేయుటకో ప్రయత్నింతురు. కొందరు మత అభిప్రాయములను అడ్డుగా

పెట్టుకొని శవమును పూడ్చిపెట్టుటయే విధిగా పెట్టుకోగా, కొందరు కాల్చివేయుటయే పనిగా పెట్టుకొన్నారు. ముఖ్యముగా క్రైస్తవులు, ముస్లీమ్‌లు శవమును పూడ్చడమే విధిగా పెట్టుకొన్నారు. హిందువులలో కొందరు పూడ్చగా కొందరు కాల్చుచున్నారు. హిందువులలో ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క నియమము గలదు. ఏది ఏమయినా చనిపోయిన శరీరమును ఎక్కువ శాతము భూమిలో పూడ్చిపెట్టడము జరుగుచున్నది. దాదాపు 20 శాతము కాల్చివేయడము జరుగుచున్నది. కాల్చిన శరీరము ఒక గంటలో పూర్తి కాలిపోగా, పూడ్చిన శరీరము పూర్తి కుళ్ళిపోవుటకు దాదాపు ఆరు నెలల కాలము పట్టును. అప్పటికి శరీరమంతయూ కనిపించక మట్టిలో కలిసిపోగా, కొన్ని ఎముకలు మాత్రము మిగిలియుండును. ఆ ఎముకలు కూడా దాదాపు ఆరు సంవత్సరములకు పూర్తి కనిపించకుండా నాశనము కాగలవు. ఈ విధముగా మనిషి శరీరము చివరకు దాని నామరూపములు లేకుండా పోవుచున్నది. మనిషి శరీరము ఒక జన్మలో ఒకటివుండగా, మరు జన్మలో మరొకటియుండును. జన్మజన్మకు శరీరములు మారు చుండును. అయితే ఏ జన్మలోనికి పోయినా జీవుడు వానితోపాటుయున్న ఆత్మ మారదు. జీవుడు (జీవాత్మ), ఆత్మ రెండూ శరీరము లోపలేయుండును. జీవుడు శరీరములో ఒక్కచోట ఉండగా, ఆత్మ శరీరమంతా వ్యాపించి యున్నది.

ఒక జన్మలో ఒక శరీరములో నివసించు జీవాత్మ, ఆత్మ శరీరమును వదలినప్పుడు వేరొక క్రొత్త శరీరమును ఆశ్రయించుచున్నవి. ఒక శరీరమును వదలడముగానీ, మరొక శరీరమును చేరడముగానీ స్వయముగా ఆత్మ చేయుచుండగా, ఆత్మను అనుసరించి జీవాత్మ పోవుచున్నదిగానీ, జీవాత్మ స్వయముగా ఆ పని చేయలేదు. జీవుడు ఏదీ చేతకానివాడు, అన్నీ

చేతనయినవాడు చేయించువాడు ఆత్మ మాత్రమేనని జ్ఞాపకముంచుకోవలెను. ఆత్మ జీవున్ని అతని కర్మను, గుణములను తీసుకొని శరీరమును మరణ సమయములో వదలివేయుచున్నది. ఆత్మ, జీవునితో సహా గుణములు కర్మలతో సహా సువాసన గాలిలో కలిసిపోయి కనిపించక ఒకచోటినుండి మరొకచోటికి ప్రయాణించినట్లు ప్రయాణించుచున్నది. ఈ విషయమును భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగమున ఎనిమిదవ శ్లోకమున ఈ విధముగా చెప్పారు.

శ్లో॥ 8. శరీరం య దవాప్నోతి యచ్చా ప్యుత్క్రామ తీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధాని వాశయాత్ ॥

**భావము :–** "శరీరములో ఈశ్వరుడైన ఆత్మ శరీరమును వదలిపోవునప్పుడు తనవెంటయున్న జీవునితో సహా శరీర గృహములోయున్న గుణములను, జీవుని కర్మను తీసుకొని సువాసన గాలిలో కలిసి కనిపించక ఇంకొక చోటికి ప్రయాణించినట్లు ఎవరికీ తెలియకుండా ఆత్మ ఒకచోటినుండి మరొక చోటికి ప్రయాణించుచున్నది."

ఇక్కడ జ్ఞానదృష్టి కల్గి చూడగలిగితే మాటలతో తెలిసిన దానికంటే ఎక్కువ తెలియగలదు. శరీరములో అంతటా ప్రాకియున్న ఆత్మకు కేంద్రము బ్రహ్మనాడి. బ్రహ్మనాడి స్థానములో సూక్ష్మముగా ఆత్మయుండగా, బ్రహ్మ నాడిని ఇరుసుగా చేసుకొని బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు గలవు. గుణచక్రములో గుణములుండగా, కర్మచక్రములో కర్మయుండగా, గుణచక్రములోనే ఒక భాగములో జీవుడుండును. ఈ చక్రములన్నిటికీ ఆధారముగా బ్రహ్మనాడిలో ఆత్మయుండి అన్నిటినీ తీసుకొని సూక్ష్మముగా కనిపించకుండా ప్రయాణించి క్రొత్త శరీరమును చేరుచున్నది. బ్రహ్మనాడి

సూక్ష్మముగా ఎలా ఉన్నదో, అలాగే కాల, కర్మ, గుణచక్రములు సూక్ష్మముగా ఎలా ఉన్నవో ఇంతకుముందు మా గ్రంథములలో చెప్పియున్నాము. ఆత్మ, జీవుడు, కర్మ, గుణములు అన్నీ కలిసి ఒక చట్రముగా ఏర్పడి అందులో జీవుడు బంధింపబడియుండి ప్రయాణించడమును దృశ్యరూపముగా ఎలా ఉండునో క్రింద చూడవచ్చును.




ఈ నాలుగు చక్రముల చట్రములో జీవుడు గుణచక్రములో బంధింపబడి యుండగా అతని కర్మ, అతని గుణములు వాటితోపాటు మధ్యలోగల బ్రహ్మనాడిలో వ్యాపించిన ఆత్మ మరణముతో బయటికి వచ్చి జీవుడు చేరవలసిన క్రొత్త శరీరము వరకు తీసుకొని పోవుచున్నది. కాల మరణములో ఇదే జరుగుచున్నది.

ఒక మనిషి చనిపోతే ఆ శరీరములోని జీవుడు అదే క్షణమే తన ఆత్మతో కలిసి వేరొక క్రొత్త శరీరమును చేరిపోగా, అతడు వదలిన శరీరము

క్రమేపీ కుళ్ళిపోతూ ఆరునెలలకు పూర్తిగా లేకుండాపోవును. ఒకవేళ హస్తికలు మిగిలినా అవి కూడా కొంతకాలమునకు లేకుండాపోవును. ఒక ఊరిలో పెద్ద హోదాలో, పెద్ద ధనికుడుగాయున్న మనిషి చనిపోయిన తర్వాత ప్రక్క ఊరిలోనే ఒక పేద కుటుంబములో పుట్టి అక్కడ ఏ పెద్దరికము లేకుండా, కడు పేదవానిగా బ్రతుకవలసిన కర్మయుంటే అతని ఆత్మ అతనిని అక్కడే పుట్టించి అలాగే కర్మను జీవుడు అనుభవించునట్లు చేయును. అమెరికాలో అంతరిక్ష పరిశోధనా సంస్థ అయిన 'నాసా'లో పనిచేసి గొప్పగా పేరు ప్రఖ్యాతులు సంపాదించిన 'కల్పనాచావ్లా' అను ఆమె తన జీవితమును పెద్ద హోదాలో, పెద్ద ఆర్థిక స్థోమతలో గడిపి చివరకు అంతరిక్ష పరిశోధనకు పోయి తిరిగివచ్చు సమయములో జరిగిన ప్రమాదము వలన చనిపోవడము జరిగినది. అమెరికాలో బ్రతికిన ఆమె భారతదేశములో ఒక పేద కుటుంబములో పుట్టడము జరిగినది. ఆమెకు తర్వాత జన్మలో నాలుగు సంవత్సరములు గడచిన తర్వాత వెనుకటి జన్మ జ్ఞాపకము రావడము జరిగినది. అప్పుడు తన గతజన్మ విషయమును గురించి ఆమె ఇతరులకు చెప్పడము జరిగినది. అప్పుడు సత్యప్రమాణముగా జరిగిన విషయమును బట్టి మనిషి మరణించిన తర్వాత జీవితమున్నదనీ, అది అతను చేసుకొన్న కర్మనుబట్టియుండుననీ తెలిసిపోవుచున్నది.

చనిపోయిన తర్వాత అతను ఎక్కడ జీవితము గడుపుచున్నాడని గానీ, ఎక్కడకు పోయాడనిగానీ, తర్వాత పుట్టాడనిగానీ ఎవరికీ ఏమాత్రము తెలియదు. అందువలన మనిషికి మనిషియొక్క మరణము వరకు తెలుసు గానీ, మరణము తర్వాత అతని స్థితి ఏమిటని ఎవరికీ తెలియదు. మరణము తర్వాత తిరిగి పుట్టునని కూడా తెలియని మానవుడు తనకు తోచినట్లు అనుకోవడము జరుగును. అలా అనుకోవడము వలన మరణము తర్వాత

స్వర్గానికి పోవుదుమని కొందరూ, లేదు నరకానికి పోవుదుమని కొందరూ చెప్పుకోవడము జరుగుచున్నది. కొందరు మరణము తర్వాత జీవితమే లేదు అని అంటున్నారు. కొందరు ప్రళయము వచ్చువరకు అతని శరీరమును పూడ్చిన గుంతలోనే ఉండుననీ, ప్రళయములో దేవుడు లేపినప్పుడు భూ సమాధులనుండి చనిపోయినవారు తమ శరీరములతోనే లేచివస్తారని చెప్పు చున్నారు. ఈ విధముగా ఎవరికి తోచినది వారు చెప్పుకోవడము జరుగుచున్నది. అయితే జరుగుచున్న సత్యము మనుషులకు తెలియుటకు దేవుడే ఆత్మ ద్వారా వెనుకటి జన్మల జ్ఞాపకమును మనిషికి కల్గించి పునర్జన్మలు వాస్తవమని తెలియజేశాడు. జరిగిన సత్యమే శాస్త్రము కనుక పునర్జన్మలున్నాయను మాట శాస్త్రబద్ధముగా నిరూపణకు వచ్చినది. భగవద్గీతలో **'పుట్టినవాడు చావక తప్పదు, చచ్చినవాడు పుట్టక తప్పదు'** అనుమాట నెరవేరుచున్నదని, వెనుకటి జన్మ జ్ఞాపకము వలన తెలియు చున్నది. దీనితో మరణము తర్వాత జీవితమున్నదనీ, అది ఇప్పుడున్న జీవితమువలే ఉన్నదని కూడా తెలియుచున్నది.

**ప్రశ్న :- చనిపోయిన వాడు భూసమాధిలో ఉండడా?**

**జవాబు :-** చనిపోయిన వాడు శరీరమును వదలి వెంటనే మరొక శరీరమును చేరి అందులో జన్మించుచున్నాడు. భూసమాధిలో మృత దేహమును మాత్రము ఉంచగా, అదికూడా కొంతకాలానికి కుళ్ళి పోయి లేకుండా పోవును. సంవత్సరము తర్వాతగానీ, లేక కొంతకాలము తర్వాతగానీ అదే గుంతలో మరియొక మృతదేహమును పూడ్చడము జరుగు చున్నది. అలా పూడ్చబడిన శరీరములు వేరు, ఆ శరీరములలో కాపురము చేసిన జీవాత్మ, ఆత్మలు వేరు. శరీరములో కొంతకాలము నివసించిన జీవుడు మరియు ఆత్మ మరణములో శరీరమును వదలిపోగా, మృత

దేహమును మాత్రము భూమిలో పూడ్చడము జరుగుచున్నది. శరీరమును పూడ్చినచోటు కూడా జీవునికి తెలియదు. ఎందుకనగా! చనిపోయిన వెంటనే అదే సెకండులోనే అతను మరియొక దేహమును చేరిపోవుచున్నాడు. అలా మరణించి వేరే శరీరమును చేరినప్పుడు తన వెనుకటి జ్ఞాపకము లన్నీ మరణముతోనే పోయివుండుట వలన గతములో తాను ఎవరిగా ఉంటినను విషయము చనిపోయి పుట్టిన వానికి తెలియదు. వెనుకటి జ్ఞాపకమే లేకుండా పోయినప్పుడు, మనిషి చనిపోయిన తర్వాత కొన్ని గంటలకు అతని శరీరమును పూడ్చిపెట్టడము జరుగుచున్నది. అంతకు ముందే రెండవ జన్మకు పోయినవానికి వాని పాతశరీరము యొక్క ధ్యాసే లేదు. వాని పాత శరీరమును ఎక్కడ పూడ్చినది, క్రొత్త శరీరములో యున్న వానికి తెలియదు. వాడు చనిపోయిన వెంటనే అదే క్షణమే రెండవ జన్మకు పోవుట వలన వాని శరీరమును పూడ్చిన భూసమాధి విషయమే అతనికి తెలియనప్పుడు, అతనువచ్చి భూసమాధిలో ఉండుననీ, ప్రళయము వరకు ఉండునని చెప్పడము పూర్తి అసత్యమగును. అట్లు ఎవరూ ఇంతవరకు ఉండలేదు.

**ప్రశ్న :- అయితే అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్‌లో ప్రళయము సంభవించినప్పుడు భూమి, ఆకాశము నశించినప్పుడు దేవుడు మనిషిని సమాధినుండి బయటికి వచ్చునట్లు చేయుచున్నాడు. సమాధినుండి వచ్చిన వానికి వాడు బ్రతికి ఉన్నప్పుడు చేసిన పాప, పుణ్యములను లెక్కించి వాటి ప్రకారము అనుభవము కల్గునట్లు చేయుచున్నాడు. వాడు చేసుకొన్న దానినిబట్టి వానికి స్వర్గమో, నరకమో నిర్ణయమగుచున్నది. ఇదంతయూ ఖురాన్ గ్రంథములో చెప్పారు. ఇది నిజము కాదా?**

**జవాబు :–** దైవగ్రంథములో చెప్పినది తప్పనిసరిగా వాస్తవమే అయివున్నది.

ఇప్పుడు మీరు చెప్పినదంతా నిజమే. అయితే దేవుడు గ్రంథములో చెప్పిన విషయములన్నియూ సత్యమే అయినా, వాటిని మనిషి సరిగా అర్థము చేసుకోకపోవడము వలన దేవుడు చెప్పినదొకటి, మనకు అర్థమయినది మరొకటి అని తెలియుచున్నది. అక్కడ గ్రంథములో చెప్పిన సమాధివేరు, మనకు అర్థమయిన సమాధి వేరని తెలియుచున్నది. నేడు పిలువబడు 'సమాధి' అను పదము పూర్వము 'ధి' క్రింద పొక్కిలి లేకుండా ఉండేది. ఆ వివరమంతయూ మేము **'సమాధి'** అను గ్రంథములో వ్రాశాము. దానినే కొద్దిగా చూడండి.

సమాధి అనగా "అందరికీ సమముగా వర్తించునది" అని అర్థము. ఈ అర్థము కొత్తగా కనిపించినా ఇదియే వాస్తవమైన అర్థము. కొందరు సమాధి అను దానికి అర్థము ఇలా చెప్పారు. **ధి** అనగా బుద్ధియనీ, సమ+ధి = సమాధియని, బుద్ధికి సమానముగా ఉన్నదని చెప్పారు. ఇది చెప్పుకోవడానికి బాగుంది. కానీ ఆ అర్థము ఏ విషయములో వర్తిస్తుందో, బుద్ధికి సమానముగా ఉన్నది ఏదో, అది బ్రతికి ఉన్నపుడా? చచ్చి పోయినపుడా? అను ప్రశ్నలు రాగలవు. చచ్చిపోయిన వానికి బుద్ధి ఎటూ ఉండదు. బ్రతికి ఉన్నవానికి సమాధితో పనిలేదు, వాడు దానిని పొందడు. సమాధి చనిపోయిన వానికే అవసరమైనపుడు, వాని బుద్ధిని గురించి చెప్పుకోవలసిన అవసరమూ లేదు. ఎందుకనగా చనిపోయిన వానికి బుద్ధి ఉండదు. ఈ విధముగా యోచిస్తే 'సమమైన బుద్ధి' అను అర్థము తప్పు అని తెలియుచున్నది. ఎవరు ఏ అర్థమును చెప్పినా అది ఆధ్యాత్మిక విద్యకు సరిపోదు. అందువలన అందరికీ సమముగా అమలు జరుగునది లేక అందరికీ సమానముగా వర్తించునను అర్థము ఆధ్యాత్మికమునకూ, ప్రత్యక్ష అనుభవమునకూ సరిపోవును. నేడు సమాధి అను పలుకబడు

పదము పూర్వము సమ+ఆది=సమాది గా ఉండేది. **ది** కి క్రింద పొక్కిలి లేదు. ఆది అనగా మొదటిలో లేక సృష్ఠి మొదటిలో అని అర్థము. సమ అనగా అందరికీ తెలిసిన అర్థమే, సమాది అనగా సృష్ఠి మొదటినుండి అందరికీ సమముగా ఉన్నదని లేక వర్తించుచున్నదని అర్థము. ఇక్కడ విశేషమేమనగా సృష్ఠి ఆదినుండి అనుటలో సృష్ఠి ప్రారంభమైన తర్వాత అందరికీ మొదటి నుండి సమాది ఉన్నదని తెలియుచున్నది. ఆదినుండి సమముగా ఉన్నది కావున, ఈ సమాది మొదటినుండి మొదలైనదని తెలియుచున్నది. జీవుని మొదటి పునర్జన్మలోనే సమాది కలదు. మనిషి చనిపోయిన తర్వాత ఏర్పడునది సమాధి కాదు. మనిషి చనిపోయినపుడు సమాది అనునది అందరికీ సమముగా వర్తించదు. ఈ మాటలు వినే మీకు ఇదంతా క్రొత్తగానే కనిపించును. కొందరు మా మాటలను ఏమాత్రము నమ్మరు. కొందరు అన్వేషకులుగా ఉన్నవారు పరిశోధనా బుద్ధితో యోచించుదురు. అట్లు యోచించువారికి తప్పకుండా సత్యము తెలియును. ఒక మనిషి చనిపోయినపుడు అతని శరీరమును భూమిలో పూడ్చిపెట్టినా, దానిని అర్థము ప్రకారము సమాధి అనిగానీ, సమాది అనిగానీ అనుటకు వీలులేదు. ఈ అర్థములు పూడ్చబడిన గుంతలకుగానీ, కట్టబడిన గోరీలకుగానీ వర్తించవు.

అన్ని మతములలోనూ సమాధి అను పదముండినా, ప్రవక్తలందరూ ఎంతో గొప్ప భావముతో చెప్పినా, దానిని ఏ మతస్థులూ సరిగా అర్థము చేసుకోలేదని చెప్పుచున్నాము. మాకందరికీ అర్థము కానిది, మాకంటే మించిన జ్ఞానపండితులకందరికీ అర్థము కానిది, నీకొక్కనికే అర్థమైనదా? అని ఎవరైనా నన్ను ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! ఏది నిజమైన జ్ఞానము, ఎవరిది నిజమైన జ్ఞానము అను ప్రశ్నకు జవాబుగా,

ఎక్కడైతే ప్రశ్న మిగిలిపోయి జవాబు లేకుండా పోవుచున్నదో అది నిజమైన జ్ఞానము కాదు. ***ఎక్కడైతే ప్రశ్న మిగలకుండా సర్వత్రా జవాబు ఉన్నదో, ఎక్కడైతే ఎవరూ ఎదురు ప్రశ్నించని జ్ఞానమున్నదో, అదియే నిజమైన దేవుని జ్ఞానమని చెప్పవచ్చును.*** నేను చెప్పిన సమాది విషయములో గానీ, ప్రవక్తలు చెప్పిన సమాది వివరములోగానీ ఎక్కడా ప్రశ్నలు మిగలవు. అందువలన ఇక్కడ మేము చెప్పు జ్ఞానము నిజమైన దైవజ్ఞానమనీ, అదియే నిజమైన ధర్మమనీ తెలుపుచున్నాము. ఇతరులు చెప్పు సమాధి విషయములో చివరకు ప్రశ్నలు మిగిలి సమాధానము లేకుండా పోవుచున్నది. అందువలన అది సూత్రము ప్రకారము నిజమైన దైవజ్ఞానము కాదని చెప్పవచ్చును. అన్ని మతముల గ్రంథములలో కూడా మేము చెప్పిన విషయమునే నూటికి నూరుపాళ్ళు ప్రవక్తలందరూ చెప్పారు.

అయితే ఒకేఒక్క పొరపాటు జరిగినది, మనిషి మాయ వశమైపోయి దేవుడు చెప్పిన దానిని తప్పుగా అర్థము చేసుకొన్నాడు. అదియే మనిషి చేసిన పెద్దపొరపాటు. ఆ పొరపాటుతోనే దేవుని ధర్మము మనుషుల మధ్యలో అధర్మముగా మారిపోయి ప్రచారమైనది. ఊరంతా ఉత్తరమంటే ఒక్కడు మాత్రము దక్షిణమన్నట్లు, మనుషులైన అందరూ మరణము జరిగినపుడు సమాధి అంటే, మేము మాత్రము అది సత్యమే కాదు, మనిషి జన్మించినపుడే సమాది అంటున్నాము. ఎవరూ చెప్పని దానిని దేవుడు చెప్పాడు, ప్రవక్తలు చెప్పారనుచూ, నీవు ఒక్కనివే విరుద్ధముగా ఎందుకు మాట్లాడుచున్నావు? అని నన్ను ఎవరైనా ప్రశ్నించవచ్చును. దానికి ధైర్యముగా మేము ఒకే జవాబును చెప్పుచున్నాము. **ఏది సత్యమో దానినే మేము చెప్పుచున్నాము.** అసత్యమును లోకములో ఉండిన వారందరూ సత్యమే అనినా అది సత్యముకాదు. దానిని నేను ఒప్పుకోను. అంతేకాక

దేవుడు చెప్పిన ప్రత్యక్ష సత్యమును గ్రహించక, అసత్య విషయమును మీరెట్లు సమర్థిస్తున్నారని మేము కూడా ప్రశ్నించుచున్నాము. కానీ మా మాట చాలామందికి మొండివాదనగా కనిపించుచుండును. బాగా యోచించు కొందరికి మా మాట సత్యమని తెలియగలదు. ఇంతవరకు అందరికీ సమాధి అను పదము సాధారణముగా కనిపించినప్పటికీ, ఇప్పుడు మేము చెప్పు భావముతో **సమాది** అను శబ్దము సామాన్యమైనది కాదనీ, ఇదేదో గొప్ప అర్థముతో కూడుకొన్నదేకాక, ధర్మాధర్మ విషయములతో ముడిపడి వున్నదని కూడా అర్థమగుచున్నది. మనుషులందరూ మభ్యపడిపోయిన సమాధి (సమాది) ఏమిటో? ఎలా ప్రత్యక్ష ప్రమాణమో వివరించుకొని చూస్తాము.

గర్భము అనుమాట అందరము వినివుంటాము. తల్లిగర్భము, భూగర్భము అనుమాటలను విని వుంటాము. గర్భము అను పదమునకు అర్థము కనిపించకుండా కప్పివుంచునదని తెలియుచున్నది. తల్లిగర్భము శిశు శరీరమును కప్పివుంచినది. అలాగే భూగర్భము మృత శరీరమును కనిపించకుండా కప్పివుంచినది. దీనినిబట్టి గర్భములు రెండు రకములనీ ఒకటి పుట్టే క్రొత్త శరీరమును దాచివుంచునది, రెండు చనిపోయిన పాతశరీరమును దాచివుంచునదని తెలియుచున్నది. భూగర్భమును అందరూ సమాధి అని అనడము జరుగుచున్నది. భూగర్భమును సమాధి అనడము చాలా పెద్ద పొరపాటు. ఎందుకనగా! భూగర్భములోని శరీరము మృతి చెందినది. ఆ శరీరములో జీవుడు లేడు మరియు ఆత్మ లేదు. జీవుడుగానీ, ఆత్మగానీ ఉన్నపుడయితే జీవునికి సమముగా వర్తించునదని చెప్పవచ్చును. జీవుడే లేనపుడు జడమైన శరీరమునకు సమముగా వర్తించునదని చెప్పుటకు వీలులేదు. జీవుడు లేని శరీరము గుర్తింపులేనిది,

కావున మృత శరీరమునకు సమాధి (సమాది) అనుమాట వర్తించదు. అట్లే తల్లి గర్భములోని శిశుశరీరములో కూడా జీవుడూ లేడు, ఆత్మయూలేదు. కావున తల్లి గర్భమును కూడా సమాది అనుటకు వీలులేదు. తల్లిగర్భము గానీ, భూగర్భముగానీ, ఒకటి పుట్టబోయే శిశు శరీరమునూ, మరొకటి చనిపోయిన మృత శరీరమును దాచివుంచునవే తప్ప అవి సమాదులు కావు. **గర్భము అనగా మర్మముగా ఉంచునది లేక రహస్యముగా దాచినదని అర్థము.**

భూగర్భమునకు గానీ, తల్లి గర్భమునకుగానీ సమాధి (సమాది) అను పేరు వర్తించనపుడు బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము ఆధ్యాత్మిక విద్యను అనుసరించి సమాది అనునది ఎక్కడున్నది? దేనిని సమాధి అనవచ్చును? అని ప్రశ్న రాగలదు. దానికి మా జవాబు ఏమనగా! ఒక మనిషిని ప్రకృతి భాగమనీ, ఆత్మ భాగమనీ రెండు భాగములుగా విభజించి చూడవచ్చును. ప్రకృతి భాగములో మొత్తము శరీరముండును. ఆత్మ భాగములో జీవాత్మ, ఆత్మ ఉండును. అంతేకాక పరమాత్మ కూడా ఉండును. కానీ పరమాత్మ శరీరము బయట, శరీరము లోపల ఉండు దానివలన ఆత్మ భాగములుగా జీవాత్మ, ఆత్మను మాత్రము పరిగణలోనికి తీసుకొన్నాము. జీవాత్మ, ఆత్మ లేని 24 భాగముల శరీరమును ఒక భాగముగా, జీవాత్మ ఆత్మను మాత్రము ఒక భాగముగా గుర్తించితే ప్రకృతి భాగమైన శరీరమునకు సమాది లేదని తెలియుచున్నది. జగతిలో ధర్మములకు గ్లాని ఏర్పడి అధర్మములు ప్రచారమైనపుడు సమాది అను ధర్మము అధర్మముగా మారిపోయి, వాస్తవమైన సమాది తెలియకుండా పోయి, అసత్యమైన సమాది తెలియుచున్నది. దానివలన ప్రజలు భూగర్భమును సమాది అనుకోవడము జరుగుచున్నది. భూగర్భమును సమాధి అనుకోవడము అధర్మము అని ఎవరికీ తెలియకుండా పోయినది.

ప్రకృతి భాగమైన శరీరమునకు కాకుండా జీవాత్మకూ, ఆత్మకూ మాత్రమే సమాది ఉన్నదనీ, ఆత్మ భాగములైన జీవాత్మ, ఆత్మలకున్న సమాదియే నిజమైన సమాది అనీ, అదియే దైవధర్మమని తెలియవలెను. జీవునికి జన్మ (పునర్జన్మ) మొదటినుండి ఉన్నదానివలన "ఆది" అని చెప్పడమే కాక, జీవులందరికీ ఒకే విధముగా వర్తించునది కావున "సమ" అని చెప్పడము జరిగినది. దానినే పూర్తిగా సమాది అని అన్నారు. మేము చెప్పునది అందరికీ క్రొత్తమార్గముగా కనిపించినా, ఇది ఇంతవరకు అణగారి పోయిన ధర్మమని తెలియవలెను. ప్రవక్తలందరూ ఇదే ధర్మమును తెలియ జేసినప్పటికీ, ప్రజలు దానిని అందుకోలేక పోయారని చెప్పవచ్చును. ప్రవక్తలు చెప్పిన సమాది ధర్మమును విశధముగా తెలుసుకోగలిగితే, మనిషి చనిపోయినపుడు శరీరమును వదలి జీవాత్మ, ఆత్మలు బయటికి పోవును. ఆ విధముగా మరణములో జీవాత్మ, ఆత్మలు వదలిన శరీరమును భూగర్భములో (భూమిలో) పూడ్చిపెట్టితే అది సమాది కాదు. సమ+ఆది = సమాది అను అర్థము భూగర్భమునకు వర్తించదు. అలాగే తల్లి గర్భము లోని జీవాత్మ, ఆత్మలేని శిశు శరీరమునకు కూడా సమాది పదము వర్తించదు. జీవాత్మ, ఆత్మ ఎక్కడ నిక్షిప్తమై పోవుచున్నారో దానినే సమాధి లేక సమాది అనవచ్చును. జీవుడు జన్మించు సమయమును "ఆది" అనవచ్చును. జీవుడు శరీరమును ధరిస్తే దానిని జన్మ లేక పునర్జన్మ అంటున్నాము. అలా శరీరమును ధరించు మొదటి సమయమును "ఆది" అనడమేకాక, అది జీవులందరికీ సమముగా వర్తించునది కావున సమాది అనడము జరిగినది. ఒక జీవుడు శరీరములో ప్రవేశించి, ఆ శరీరములో నిక్షిప్తమై (దాచబడి) ఎవరికీ కనిపించకుండా ఉండడమును వాస్తవముగా సమాది అనవచ్చును.

ఆత్మ, జీవాత్మలు రెండూ జోడు ఆత్మలు, ఒకదానిని వదలి ఒకటి ఉండుటకు వీలులేదు. జీవుడు జన్మలకు పోకుండా మోక్షమును పొందినపుడే ఆత్మ, జీవాత్మ ఒకదానిలో ఒకటి కలిసిపోవడము జరుగుతుంది. అంతవరకు ఎన్ని యుగములు గడచినా, ఎన్ని కల్పములు అయిపోయినా జీవాత్మ, ఆత్మలు విడిపోవు. శరీరము మరణించినపుడు శరీరమును వదలి పోయిన జీవాత్మ, ఆత్మలు కర్మప్రకారము నిర్ణయింపబడివున్న వేరొక శరీరమును చేరును. అలా వేరొక శరీరమును చేరడమును జన్మ లేక పునర్జన్మ అనవచ్చును. శరీరమును వదలి పోవడమును మరణమనీ, క్రొత్త శరీరమును చేరడమును జననమనీ, అందరికీ తెలిసినా మరణములో ఏమి జరుగుచున్నదీ, జననములో ఏమి జరుగుచున్నదీ వాస్తవముగా ఎవరికీ తెలియదు. జనన మరణములు బ్రహ్మవిద్యా శాస్త్రములో సిద్ధాంతములే అయినప్పటికీ అవి ఎవరికీ తెలియవు, కావున రహస్యములుగా మిగిలి పోయాయి. మేము గతములో వీటి వివరము అందరికీ అర్థమగులాగున **"జనన మరణ సిద్ధాంతము", "మరణ రహస్యము", "పునర్జన్మ రహస్యము" "సమాధి"** అను గ్రంథములను వ్రాయడము జరిగినది.

**ప్రశ్న :- 'సమాధి' అనగా మీరు చెప్పిన అర్థము ప్రత్యేకముగాయున్నది. ఇప్పటినుండి మేము కూడా మీ భావము ప్రకారమే సమాధిని గురించి అనుకుంటాము. అయితే దైవగ్రంథములో 'ప్రళయము' అనుమాటను వ్రాశారు కదా! దానిని గురించి మీరు ఏమంటారు?**

**జవాబు :-** దేవుడు సూక్ష్మమైనవాడు కనుక దేవుని విషయమై చెప్పిన జ్ఞానమును సూక్ష్మముగా అర్థము చేసుకోవలసియున్నది. సూక్ష్మముగా అర్థము చేసుకొన్నప్పుడే దేవుని జ్ఞానములోని నిజమైన భావము తెలియ బడును. దానిప్రకారము ఇక్కడ చెప్పిన ప్రళయమును కూడా మీరు

స్థూలముగా అర్థము చేసుకోక సూక్ష్మముగా అర్థము చేసుకోవలసిన అవసరము ఉన్నది. **“దేవుడు సృష్టి ఆదిలో భూమియు, ఆకాశములను వాటి మధ్యయున్న సమస్తమును సృష్టించెను”** అని అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో సూరా 50, ఆయత్ 38 లో చెప్పడమైనది. మరియొక చోట ఏడు ఆకాశములని కూడా చెప్పారు. ఇక్కడ భూమి, ఆకాశములు అను వాటిని స్థూలముగా తీసుకోకూడదు. స్థూలముగా తీసుకొంటే వాక్యములో యున్నట్లు ‘ఆకాశములు’ అను బహువచన మాటకు అర్థమే లేకుండా పోవును. అప్పుడు ఆ వాక్యము సరియైన భావములో అర్థము కాకుండా పోవును. అందువలన గ్రంథములో చెప్పిన వాక్యము సక్రమముగా అర్థమగుటకు సూక్ష్మముగానే అర్థము చేసుకోవలెను. ఇలా సూక్ష్మముగా అర్థము చేసుకొను విషయములు గ్రంథములో ఉండుట వలన మూడవ సూరాలోనే దేవుడు (అల్లాహ్) గ్రంథములో ‘ముతషాబిహాత్ వాక్యములు (సూక్ష్మవాక్యములు)’ ఉన్నాయని చెప్పాడు. అందువలన దేవుడు దైవ గ్రంథములలో చెప్పిన వాక్యములను కొన్నిటిని తప్పక సూక్ష్మముగానే అర్థము చేసుకోవలసియున్నది. ఇక్కడ ప్రళయము అనగా స్థూలముగా అర్థము చేసుకోకూడదు. ప్రళయము స్థూలముగా ఎప్పటికీ జరుగదు. పుట్టినదంతా నాశనము కావడమును ‘ప్రళయము’ అంటాము. పుట్టినదంతా నాశన మగుట నిజమే అయినా, అది బయట ప్రపంచములో జరుగదు. బయటి ప్రపంచములో ప్రకృతికి సంబంధించి కొన్ని ప్రకృతి భీవత్సవములు రావచ్చుగానీ, ప్రళయము రాదు. ప్రకృతి సంబంధ భీవత్సవమైనాగానీ, ఒక పరిమితమైన కొద్దిపాటి ప్రాంతములో జరుగును. అంతేతప్ప ఏకంగా ప్రపంచమంతా ప్రళయము జరుగదు. అదే విషయమునే **“కలియుగము ఎప్పటికీ యుగాంతము కాదు”** అను గ్రంథములో వ్రాశాము. కలి యుగములో ప్రళయము రాదు, కలియుగము 4,32,000 సంవత్సరములు

అయిపోయిన వెంటనే కృతయుగము ప్రారంభమగునని కూడా మేము గ్రంథములో వ్రాయడము కూడా జరిగినది.

భూమిమీద రెండు ప్రకృతులున్నాయి. ఒకటి ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమికాగా వీటినే పంచ భూతములు అంటాము. రెండవది పంచభూతములన్నియూ ఒకదానితో మరొకటి కలిసి తయారయిన శరీర రూపముగాయున్న ప్రకృతి. మొదటి దానిని 'అచరప్రకృతి' యని అంటాము. రెండవ దానిని 'చరప్రకృతి' అంటాము. అచర ప్రకృతియనగా మార్పు చెందని ప్రకృతియని చెప్పవచ్చును. అట్లే చరప్రకృతియనగా మార్పుచెందే ప్రకృతియని అర్థము. మార్పుచెందే ప్రకృతి అయిన చరప్రకృతిగాయున్న శరీరము ఎప్పుడో ఒకప్పుడు నాశనముకాక తప్పదు. ఒక దినము జీర్ణమైన దేహమునుండి జీవుడు, ఆత్మ రెండూ బయటికి పోవును. జీవుడు, ఆత్మ నివాసయోగ్యముకాని నాశనమయిన శరీరమునుండి బయటికి పోవడము అందరికీ తెలిసిన విషయమే. చావును **'ఒక గడువు'** అని ఖురాన్ గ్రంథములో కూడా చెప్పారు. గడువునే చావు లేక మరణము అంటున్నాము. మరణమునే శరీరములో జరుగు ప్రళయము అంటున్నాము. శరీరములో ఏదీ సరిగాలేకుండా జీర్ణావస్థకు చేరడమును పుట్టినదంతా నాశనమయినట్లు లెక్కించి దానిని ప్రళయము అంటున్నాము. శరీర ప్రళయము జరిగినప్పుడు అనగా మనిషి చనిపోయినప్పుడు వెంటనే జీవుడు రెండవ జన్మకు పోవలసి యున్నది. అప్పుడు జీవుడు తల్లిగర్భమునుండి బయటపడిన శరీరములో ఆత్మ ప్రవేశింప చేయగా, శిశుశరీరములో జీవుడు మూర్ఛస్థితిలో యుండును. అప్పుడు ఆత్మ బయటి ధ్యాస కలుగజేయగా శిశుశరీరములో మూర్ఛనుండి బయటి ధ్యాసలోనికి రావడమును సమాధినుండి బయట పడడము అని పెద్దలనెడి వారు. ఇది వాస్తవముగా జరుగు తతంగముకాగా

అదే విషయమునే సూక్ష్మజ్ఞానముగా దైవగ్రంథములలో తెలిపియుండగా, మనిషి దానిని అర్థము చేసుకోలేక పోవడము వలన దేవుడు చెప్పిన జ్ఞానము మనకి తెలియకుండా పోయినది. దైవగ్రంథములు మనముందరకు వచ్చి ఇంతకాలమయినా ఒక్కరు కూడా దేవుడు చెప్పిన అసలయిన జ్ఞానము తెలియలేకపోయారు. అందువలన ప్రళయము అంటే బయట జరుగునదనీ, సమాధి అంటే భూగర్భములోనిదనీ చెప్పుచున్నారు. అలా చెప్పితే ఎప్పటికీ దేవుని జ్ఞానము అర్థము కాదు.

మరణము తర్వాత జీవితమున్నదని దైవగ్రంథములోయున్నా, అది ప్రళయము తర్వాత వస్తుందనీ, అది స్వర్గనరకములతో కూడుకొన్నదనీ చాలామంది అనుకోవడము కూడా జరుగుచున్నది. మరణము తర్వాత వెంటనే పుట్టి మళ్ళీ జీవించడమే 'మరణము తర్వాత జీవితమని' చాలామంది అర్థము చేసుకోలేకపోయారు. మరణాంతర జీవితములో స్వర్గనరకములున్నా యని స్వర్గనరకములను గురించి చెప్పడము జరిగినది. మరణము తర్వాత వచ్చిన జీవితము మొదటి జన్మలోనున్న జీవితమువలె వుండును. గత జన్మలో సంపాదించుకొన్న పాపపుణ్యములను ఈ జన్మలో అనుభవించ వలసియుండును. ఈ విధముగా ఒక జన్మలో చేసిన పాపపుణ్యములు కర్మచక్రములో ఆత్మ నిలువ చేయుచున్నది. దానినే ఒక సందర్భములో **'కర్మపత్రము'** అని ఖురాన్ గ్రంథములో అన్నారు. జన్మజన్మలలోనూ ఏర్పడు కర్మప్రకారము రెండవ జన్మలలో బ్రతుకు సాగించవలసియున్నది. కర్మప్రకారము జీవితములో ఎన్నో మంచి చెడు సంఘటనలు, ఎన్నో సుఖ దుఃఖములు జరుగుచుండును. కర్మప్రకారము పుణ్యము అనుభవానికి వచ్చినప్పుడు వానికి దానివలన సుఖములు ఏర్పడును. అది అయిపోయిన వెంటనే పాపము అనుభవమునకు వచ్చినప్పుడు మనిషికి కష్టములు,

దుఃఖములు ఏర్పడుచున్నవి. ఎప్పుడు సుఖములు వస్తున్నవో అప్పుడు వాడు స్వర్గమును అనుభవించినట్లగును. అట్లే ఎప్పుడు కష్టములు, బాధలను మనిషి అనుభవించుచుండునో అప్పుడు వాడు నరకమును అనుభవించి నట్లగును.

జీవితము కొన్ని సంవత్సరముల పొడవాటి ప్రయాణము. దానిలో అప్పుడప్పుడు వాడు చేసుకొన్న గత కర్మలనుబట్టి కొన్నిమార్లు సుఖములు, కొన్నిమార్లు కష్టములు ఏర్పడుచుండును. అందువలన 'జీవితము సుఖ దుఃఖముల కలయిక' అని పెద్దలు చెప్పడము జరిగినది. మనిషి ఎప్పటికీ తన జీవితములో ఒకేదాటిగా స్వర్గమును అనుభవించడు, అట్లే ఒకేదాటిగా దుఃఖములతో కూడుకొన్న నరకమును అనుభవించడు. స్వర్గము నరకములు అను శబ్దములు రెండు సుఖదుఃఖముల గుర్తింపు పదములేగానీ అవి ప్రత్యేకమయిన లోకములు కావు. నేడు చాలామంది దేవుడు చెప్పిన జ్ఞానమును వదలి మనుషులు చెప్పిన జ్ఞానమునే అనుసరిస్తూ, స్వర్గ నరకములు రెండు వేరువేరు లోకములుగా అర్థము చేసుకొన్నారు. అలా వేరువేరు లోకములు ఎక్కడా లేవు. అట్లు అర్థము చేసుకోవడము అజ్ఞానమగును. దేవుడు పుట్టుకను ఇచ్చాడు అలాగే మరణమును ఒక గడువుగా నిర్ణయించాడు. ఆ గడువు ప్రకారము అతనికి మరణము కలిగించుచున్నాడు. తర్వాత మొదటివలె రెండవ జీవితమును కూడా ప్రసాదిస్తున్నాడని అంతిమ దైవగ్రంథములో ఎంతో వివరముగా చెప్పి యుండగా, దానిని మనుషులు తప్పుగా అర్థము చేసుకొని మరణము తర్వాత మనిషి పుట్టడని అంటున్నారు. మరణము తర్వాత జీవితము ముందు జన్మలోవలె సుఖదుఃఖములతో కూడుకొని యున్నదని దేవుడు తన గ్రంథములో అదే చెప్పాడని తెలియలేకపోయారు. అందువలన "మనిషి

ఒకమారే పుట్టి ఒకమారే చనిపోవును, తర్వాత జన్మలు అంటూ ఏమీలేవు. ప్రళయము తర్వాత దేవుడు మనిషిని సమాధినుండి లేపి వాని కర్మను అనుసరించి కొందరికి స్వర్గమును, కొందరికి నరకమును ఇస్తున్నాడని'' చెప్పుకోవడము జరుగుచున్నది. స్వర్గమునకు పోయినవాడు శాశ్వతముగా ఆ లోకములో సుఖములను అనుభవించుచుండునని మనిషికి స్వర్గము మీద ఆశ కల్గునట్లు స్వర్గమును వర్ణించి చెప్పారు.

వాస్తవముగా చెప్పితే స్వర్గ నరకములనునవి ప్రత్యేక లోకములుగా లేవు. అయితే మనుషులు పూర్వమునుండి స్వర్గ నరకములనునవి ప్రత్యేక లోకములని చెప్పుచూ వస్తున్నారు. ఐదువేల సంవత్సరముల పూర్వము ఇతర మతములు లేని కాలములో ఇందూ (హిందూ) సమాజము ఒక్కటే యున్న కాలములో స్వర్గనరకములను గురించి బాగా ప్రచారమయినది. స్వర్గలోకమునకు ఇంద్రుడు రాజనీ, నరకలోకమునకు యముడు రాజనీ చెప్పెడివారు. అలాగే పురాణ గ్రంథములలో వ్రాయుట వలన, కథల రూపములో చెప్పడము వలన, అందరి మనోభావములలో స్వర్గనరకములు రెండూ ప్రత్యేకమైన లోకములుగా ఉన్నవని ముద్రించుకొన్నారు. సావిత్రి పురాణములో సావిత్రి తన భర్త ప్రాణములకై యమధర్మరాజు వెంటపడి దాదాపు యమలోకము దగ్గరివరకు పోయిందనీ, చివరకు యమధర్మరాజు నుండి తన భర్త ప్రాణములను విడిపించి తెచ్చుకొందనీ, నాటకముల రూపములో అన్ని ఊర్లలో ప్రదర్శించడము వలన అప్పటికాలములో నరక లోకముందని బాగా ప్రచారమయినది. దానికి తోడు ఎన్నో పురాణములలో స్వర్గ నరక లోకముల ప్రసక్తి రావడముతో, స్వర్గనరకములనునవి ప్రత్యేక లోకములుగా ఉన్నాయని అందరిలో పూర్తి నమ్మకము ఏర్పడినది. తర్వాత కొంతకాలమునకు వచ్చిన క్రైస్తవ మతములోనూ, ఇస్లామ్‌లోనూ స్వర్గ

నరకముల స్థానములు పదిలముగా ఉన్నట్లు వారు కూడా స్వర్గ నరకములను గురించి చెప్పుకోవడము జరిగినది. అంతేకాక ఎందరో ఆధ్యాత్మిక గురువులు అన్ని మతములలోనూ స్వర్గనరకముల కథలను చెప్పడము వలన, వారి మాటను మించి ఆలోచన చేయలేని వారు అందరూ స్వర్గ నరకములు ప్రత్యేక లోకములుగా ఉన్నాయని విశ్వసించారు.

ప్రత్యక్షముగా జరిగే తమ జీవితములో స్వర్గముల గుర్తులయిన సుఖములను అనుభవిస్తున్నా, ఇది స్వర్గము కదా!యని ఏమాత్రము గ్రహించ లేకపోయారు. అట్లే తమ జీవితములో ప్రత్యక్షముగా నరకమునకు గుర్తులయిన దుఃఖములను అనుభవిస్తున్నా, ఇదియంతయూ నరకము కాదా!యని గ్రహించలేకపోయారు. దానివలన అందరిలో స్వర్గనరకములు ప్రత్యేకముగా ఉన్నాయనీ, పుణ్యము చేసినవాడు స్వర్గానికిపోయి సుఖములను అనుభవించి తర్వాత పాపమును అనుభవించుటకు నరకమునకు పోయి అక్కడ పాపము అంతయూ అయిపోయిన తర్వాత తిరిగి భూమిమీద పుట్టునని ఎన్నో పురాణములలో ఉండుట వలన దానినే నిజమని అందరూ నమ్మినారు. అందువలన అందరి హృదయములలో స్వర్గనరకములు ప్రత్యేక లోకములుగా ఉన్నాయని అందరికీ పూర్తి నమ్మకము ఏర్పడినది. అయితే వాస్తవానికి స్వర్గనరకములు ప్రత్యేక లోకములుగా లేవని ఎవరూ గ్రహించ లేకపోయారు. దైవగ్రంథములలో వాటి ప్రస్తావన వచ్చినా, వాటిని తమ జీవితములోనే జరుగు క్రియలనీ, వాటిలోనే సుఖదుఃఖములు జీవితములో ఏర్పడుచున్నవనీ, అర్థము చేసుకోలేక దైవగ్రంథములలోని మాటలను కూడా వేరుగా అర్థము చేసుకొంటున్నారు. దానితో మరణము తర్వాత జీవితము స్వర్గములోనో లేక నరకములోనో ఉండునని నమ్ముచున్నారు. మరణము తర్వాత వచ్చిన స్వర్గ నరకములలోనే మనుషులు శాశ్వితముగా

ఉండి పోవుదురని  చెప్పువారందరూ మరణము తర్వాత జీవితమున్నదని చెప్పు చున్నారు.  అయితే ఆ జీవితము ఇక్కడే కలదనీ, ఇక్కడ భూమిమీద జరిగే జీవితములోనే స్వర్గనరకములు కలగలుపుగా అనుభవిస్తున్నారని తెలియలేక పోవుచున్నారు.

ఎంతో గాఢముగా నేడు స్వర్గనరకములు ఎక్కడో కలవని అనుకొను మనుషులకు నిజమైన దైవజ్ఞానము ఇదియని మేము చెప్పినా  వినే స్థితిలో లేనివారు,  సనాతన ధర్మములకు భంగము కల్గించుచున్నామని మా మీద ఆరోపణ చేయడమేకాక,  ఎంతో గాఢముగా దూషించువారు కూడా కలరు. అందువలన మనిషిలోని అజ్ఞానమును తీసివేయుట దుస్సాధ్యమని తెలిసి పోయినది.  అయితే మేము చెప్పుబోధ అందరికీ కాదు, నా మాట మీద నమ్మకమున్నవారికి మాత్రమేయని చెప్పుచున్నాము.  సనాతన ధర్మమంటే ఏమిటో తెలియనివారు  అజ్ఞాన బోధలను సనాతన ధర్మమనుకొనుచున్నారు. మేము బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి ఎన్నో క్రొత్త రహస్యములతో సహా అసలయిన ఆధ్యాత్మికము శరీరములోనే ఉన్నదనీ, ఆత్మజ్ఞానమును తెలియాలంటే  శరీరములో ఆత్మను గురించి తెలియవలెననీ, శరీర యంత్రాంగమంతా ఎలాగ జరుగుచున్నదో తెలియగల్గితే  అసలయిన ఆధ్యాత్మికమంతా తెలిసిపోవునని చెప్పుచున్నాము.  మేము మా బోధలలో శరీరాంతర్గత సమాచారమును తప్ప  ఇతర జ్ఞానమును బోధించడము లేదు.  అయితే అజ్ఞానులు రాముడు దేవుడని మీరు చెప్పలేదేయని కొందరూ, అమ్మవారే ఆదిపరాశక్తియని చెప్పలేదేయని కొందరూ మాతో వాదనకు దిగుచున్నారు.  కొందరయితే ఏకంగా ఇది హిందువుల జ్ఞానమే కాదు అని అంటున్నారు.

నేను ఇందువుగా పుట్టాను, అన్ని మతముల సారము నాకు అర్థమయినది. ఏ ఒక్క మతములో కూడా ఇతర మతములోనివారిని గౌరవించు మతసామరస్యము లేదని తెలిసిపోయినది. అందరికీ ఒకే దేవుడు అయినప్పుడు ఈ మతద్వేషములు ఎందుకు? అను ప్రశ్నకు జవాబుగా అందరి దేవుడు ఒక్కడే, అందరి జ్ఞానము ఒక్కటేయనుటకు తార్కాణముగా దైవగ్రంథములోని వాక్యములనే మేము అందరికీ తెలుపడము జరిగినది. మొదట పుట్టినది సనాతనముగా ఉన్నది. మధ్యలో వచ్చినది అదే జ్ఞానమయినా మనుషులు అర్థము చేసుకోలేక ఒకే జ్ఞానమునే చివరకు మూడు రకముల మతములుగా చెప్పుకొంటున్నారు. మొదట చెప్పిన భగవద్గీత జ్ఞానమే తమయందు కలదనీ, దానినే మేము ధృవీకరిస్తున్నామనీ ఖురాన్ గ్రంథములో ఐదవ సూరాలో చెప్పియున్నా ఆ మాటను ఎవరూ పట్టించుకోవడము లేదు. మూడు మతములలో, మూడు గ్రంథములలో ఒకే జ్ఞానమున్నా దానిని గ్రహించుకొనే స్థితిలో మూడు మతముల వారు లేరు. ఉదయము లేచింది మొదలు దేవుడు చెప్పిన జ్ఞానమును చూస్తాము అని అనుకోకుండా మతద్వేషములవైపే ప్రజలు ప్రయాణించుచున్నారు. అటువంటి వారి దృష్ఠిలో మూడు మతములలోని జ్ఞాన వివరములను చెప్పు మాలాంటివారిని కూడా వారి మతద్వేషములకు అంటగట్టుచున్నారు. ఎక్కడయినా ఏ మతగ్రంథములో అయినా దేవుని జ్ఞానమును తప్పుగా అర్థము చేసుకొనివుంటే, అక్కడ అలా అర్థము చేసుకోకూడదని చెప్పి, దానికి నిజార్థమును మేము తెలియజేయుచుండుట వలన, మా తప్పులను సవరించి చెప్పుచున్నారని సంతోషపడక, మా తప్పులను బయటపెడుతున్నా డని అసూయపడువారే ఎక్కువయిపోయారు. భగవద్గీతలో హిందువులు తప్పుగా అర్థము చేసుకొన్న దానిని అది సరియైన భావముకాదు, ఇది సరియైన భావమని వివరముగా తెలియచెప్పితే వారు సంతోషపడక

అసూయతో చూస్తున్నారు. మిగతా మతములవారు కూడా అదే విధముగా తయారయినారు. ఎవరు ఎట్లు భావించి చూచినా మేము దేవుని సేవ చేయాలను నిర్ణయముతో నిజ జ్ఞానమును తెలుపుటయే దేవునికి సేవ చేసినట్లని తలచుచున్నాము. అందువలన ఎవరు ఏమనుకొనినా, ఎక్కడయితే దేవుని జ్ఞానము ప్రక్కదారిలో నడుస్తున్నదో, అక్కడ సవరించి దానిని సరియైన దారిలో పెట్టడమే మా కర్తవ్యముగా పెట్టుకొన్నాము.

మూడు దైవగ్రంథములలోనూ ఒకే జ్ఞానము కల్గియున్నప్పుడు అది అందరికీ సులభతరమేయగును. అయితే మాదివేరు జ్ఞానము, మీది వేరు జ్ఞానము అని అనుకోవడము వలన అది దారి తప్పిపోయినది. ఎవరంతకు వారు చెప్పిన దానిని సమర్థించుకొంటున్నారు. అలా సమర్థించుకోవడములో ఎవరి జ్ఞానమును వారు మరచిపోయి మా దేవుడే వేరు అంటున్నారు. అందరి దేవుడు ఒక్కడేయను మాట మరచిపోయారు. మేము మూడు గ్రంథములలోని సూక్ష్మజ్ఞానమును గ్రహించి దేవుడు చెప్పిన జ్ఞానము బయట లేదనీ, శరీరములోనే గలదని తెలిసి శరీర అంతర్ముఖ జ్ఞానమునే చెప్పుచున్నాము. అలా చెప్పడము వలన దేవుని జ్ఞానములోని వాస్తవము సులభముగా తెలియుచున్నది. దేవుడు సృష్ట్యాదిలో "భూమి ఆకాశములను మరియు వాటి మధ్యనున్న సమస్తమును సృష్ఠించెను" అని ఉన్నది. అక్కడ ఆ వాక్యమునకు స్థూలముగా అర్థమును చెప్పితే 'ఆకాశములను' బహు వచనముగా చూపలేము. ఆ వాక్యమును ఎటుతిరిగి సూక్ష్మ అర్థముతో చెప్పగలిగినప్పుడే నిజమైన భావము తెలియును. దేవుడు మూడు గ్రంథము లలో చెప్పిన జ్ఞానమునంతటినీ మేము సూక్ష్మముగా చెప్పుట వలన మా జ్ఞానము మూడు మతములవారికి సమన్వయమైనది, మతసామరస్యము కల్గించునదియైనా అది ప్రజలకు ఒంటబట్టలేదు. మమ్ములను కూడా

ద్వేషించుచున్నారు. హిందువులయితే ఇతర మతముల బోధలను ప్రచారము చేయుచు ఇతర మతముల అభివృద్ధికి పాటుపడుచున్నాడని అంటున్నారు. ఇతర మతముల వారయితే మమ్ములను హిందువులుగా మార్చుటకు ప్రయత్నము చేయుచున్నారని అనుకొనుచున్నారు. **"మత మార్పిడి దైవ ద్రోహము"** అని మేము గ్రంథమును వ్రాసినా దానిని ఎవరూ గ్రహించలేదు. మేము చెప్పు జ్ఞానమును కొందరు తెలియగల్గి ఇది ఎంతో గొప్ప జ్ఞానము, సామాన్య మానవులు చెప్పే జ్ఞానముకాదని పొగడుచుండగా, చాలామంది అసూయతోనే మాట్లాడుచున్నారు.

ఎవరు ఏమనుకొనినా మేము చెప్పు జ్ఞానమంతయూ శరీరాంతర్గత మైనది. ఆత్మల సంబంధమైనది శరీరములోని ఆత్మయే శరీరమును నడుపుచుండగా, పరమాత్మ సాక్షిగా చూస్తూ ఏమీ చేయక ఊరకున్నదనీ, జీవాత్మ శరీరములో జరిగే పనులద్వారా కష్టసుఖములను అనుభవించు చున్నదని ముఖ్యముగా చెప్పుచున్నాము. **మూడు గ్రంథములలో ముఖ్యమైన సారాంశము మూడు ఆత్మల విషయమే.** మూడు ఆత్మలను మేము **"త్రైతము"** అని చెప్పగా, క్రైస్తవులు **"త్రిత్వము"** అని చెప్పగా, ముస్లీమ్‌లు **"తౌరాత్"** అని చెప్పారు. ఇదే విషయమునే భగవద్గీతలో **క్షర, అక్షర, పురుషోత్తమ** అను మూడు ఆత్మలను గురించి పురుషోత్తమ ప్రాప్తి యోగము అను అధ్యాయమున చెప్పగా, బైబిలులో మత్తయి సువార్త 28వ అధ్యాయములో 19వ వాక్యములో **కుమారుడు, తండ్రి, పరిశుద్ధాత్మయని** ముగ్గురిని (మూడు ఆత్మలను) గురించి చెప్పగా, అంతిమ దైవగ్రంథములో 50వ సూరాయందు 21వ ఆయత్‌లో **త్రోలబడేవాడు, తోలేవాడు, సాక్షిగా చూచేవాడు** ముగ్గురు ఉన్నారని చెప్పారు. భాష వేరయినా, గ్రంథములు వేరయినా, చెప్పిన జ్ఞానము మూడింటిలో ఒక్కటేయున్నదనుటకు ఇంతకంటే సాక్ష్యము వేరే

ఏమీ అవసరము లేదు. మూడు దైవగ్రంథములలో ముఖ్యమైన జ్ఞానము మూడు ఆత్మలను గురించి చెప్పినదే అయినందున, ఒక దైవగ్రంథమును పూర్తిగా తెలిసిన వానికి మిగతా రెండు గ్రంథములలోని మూడు ఆత్మల జ్ఞానము సులభముగా అర్థమగును. నేను భగవద్గీతలోని మూడు ఆత్మల జ్ఞానమును తెలియగలిగి **"త్రైతసిద్ధాంత భగవద్గీత"** అను పేరుతో గ్రంథమును వ్రాసియుండుట వలన, మిగతా రెండు గ్రంథములలోని మూడు ఆత్మల జ్ఞానము సులభముగా తెలియగలిగాము. అంతిమ దైవగ్రంథములోని వాక్యములను ముస్లీమ్‌లు సరిగా అర్థము చేసుకోనందున, వారికి మూడు ఆత్మల సూక్ష్మజ్ఞానము తెలియనందున మేము కొన్ని ముఖ్యమైన ఆయత్‌లను వివరించి వ్రాయాలని **"అంతిమ దైవ గ్రంథములో జ్ఞానవాక్యములు"** అను గ్రంథమును వ్రాశాము. భగవద్గీత నాకు సులభముగా అర్థమగుట వలన, అదే జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో ఉండుట వలన, అవి కూడా సులభముగానే అర్థమయినవి. అన్నిటికంటే ముందు **స్వమత అభిమానము, పరమత ద్వేషము లేనివానికి మూడు గ్రంథములలో చెప్పినది ఒకే జ్ఞానమని తెలియగలదు.** మేము అన్ని మతములలో ఒకే జ్ఞానమున్నదనీ, ఒకే దేవున్ని గురించి చెప్పినదనీ తెలిసి అదే విధముగా వ్రాశాము.

మేము బయట దేవతలను గురించి చెప్పినా, ఉన్న సత్యమును చెప్పాము. మనుషులు ఆరాధించు ఆరాధనలు దేవతలకు కాకుండా దేవునికి చెందితే బాగుండునని భగవద్గీతలో చెప్పిన జ్ఞానమునే మేము వివరించి చెప్పాము. అంతేగానీ ప్రత్యేకించి ఈ దేవుడు గొప్పయనీ, ఆ దేవుడు చిన్నయనీ ఎక్కడా చెప్పలేదు. మూడు గ్రంథములలోని జ్ఞానమునే కూలంకషముగా చెప్పుచూ, ఇప్పుడు మరణము తర్వాత జీవితమును

గురించి చెప్పుచున్నాము. మరణము తర్వాత జీవితము నా వ్యక్తిగత అభిప్రాయము కాదు. దైవగ్రంథములలో చెప్పిన విషయములను ఆధారము చేసుకొని చెప్పునదేయని తెలియవలెను. మరణములు నాల్గు రకములని ఎక్కడా ఎవరూ చెప్పకున్నా మరణమును గురించి మాత్రము మేము చెప్పియున్నాము. మరణ జ్ఞానమునుబట్టి మరణము ఏదో, మరణముకానిది ఏదో సులభముగా తెలియవచ్చును. ఆ విధానము ప్రకారము మరణమును ఒక్కదానినే కాకుండా మనిషి అకాల మరణమును కూడా పొందుచున్నాడని తెలియగలిగాము. చనిపోయినా, శరీరము లేకుండా పోయినా, పదిహేను భాగముల సూక్ష్మశరీరముతో బ్రతుకువారు ప్రత్యక్ష సత్యముగా ఎందరో ఉండుటనుబట్టి వీరందరూ మరణమును పొందలేదనీ, అకాల మరణమును పొందారని చెప్పగలిగాము. అకాల మరణము ప్రత్యక్ష అనుభవములతో తెలియుట వలన దానిని ఎవరూ కాదనలేరు. అలాగే కొంత సమయము చనిపోయి తిరిగి సజీవముగా లేచిన వారు ఎందరో గలరు. వారిది కూడా ప్రత్యక్షముగా జరిగిన, జరుగుచున్న సంఘటనలే కావున వాటిని **"తాత్కాలిక మరణము"**లని పేరుపెట్టి చెప్పాము. ఈ మూడు మరణములు మనిషి జీవితములో జరుగుచున్నవి. నాల్గవది మాత్రము ఆఖరీ మరణము. దానిని పొందినవాడు తిరిగి పుట్టడు. వాడు దేవునియందే ఐక్యమై పోవును. దానినే మోక్షము అంటాము. ఇంతకు ముందు కాలమరణమును గురించి సవివరముగా తెలుసుకొన్నాము. ఇప్పుడు అకాల మరణమును గురించి తెలుసుకొందాము. కాల మరణమును పొందినవాడు తర్వాత వెంటనే మళ్ళీ భూమిమీదనే క్రొత్త జీవితమును, క్రొత్త శరీరముతో ప్రారంభించు చున్నాడు. మరణము తర్వాత అదే క్షణమే తిరిగి జన్మకల్గుట వలన మరణము తర్వాత ఇప్పుడున్న జీవితమే ఉన్నదని తెలిసిపోయినది. అయితే గతజన్మలో మనిషి చేసుకొన్న పాపపుణ్యములను కూడా అదే మనిషే రెండవ

జన్మలో అనుభవించుచున్నాడని తెలిసిపోయినది. అంతేగానీ ప్రత్యేకించి స్వర్గము గానీ, నరకముగానీ మరణము తర్వాత లేవని అర్థమయినది. ఇప్పుడు అకాల మరణము ఎలా సంభవించునో, అకాల మరణము తర్వాత మనిషి ఏ స్థితిలో ఉండునో వాటి విషయమంతయూ సమూలాగ్రముగా తెలుసు కొందాము. ఇది అందరికీ తెలియని విషయము కావున జాగ్రత్తగా వినండి, జాగ్రత్తగా చదవండి.

ఏదయినా అనుభవిస్తేగానీ బాగా అర్థముకాదు. ఒకవేళ అనుభవిస్తే తిరిగి చెప్పేదానికి అనుభవించిన వానికి జ్ఞాపకముండాలి. అనుభవించిన తర్వాత దానిని గురించిన జ్ఞాపకము లేకపోతే దానిని అనుభవించినా ప్రయోజనముండదు. మరణము పుట్టిన మనిషికి తప్పక వచ్చును. అయితే మరణమును పొందినవాడు అదే సెకండులోనే వేరే శరీరమును చేరుచున్నాడు. ఎప్పుడయితే మనిషి మరణము పొందుచున్నాడో, దానికంటే ఒక సెకను ముందు శరీరములోని అన్ని భాగములతో జీవుడు సంబంధము కోల్పోతూ వచ్చును. చివరిలో మనస్సుతో కూడా సంబంధము కోల్పోయిన తర్వాత జీవుడు శరీరమును వదలును, దానినే 'మరణము' అంటున్నాము. మరణముకంటే ఒక్క క్షణము ముందే మనస్సు లేకుండా నశించిపోవు చున్నది. కావున ఆ శరీరములోని జ్ఞాపకములన్నీ జీవుడు కోల్పోవును. మరణములో మనస్సే లేదు, కావున ఆ సమయములో జరగు అనుభవమును జ్ఞాపకము పెట్టుకొనువారు ఎవరూ ఉండరు. ఎందుకనగా! శరీరములో జ్ఞాపకము అనునది మనస్సు వలననే జరుగుచుండును. నాలుక ఏ విధముగా రుచిని చూడడము అను కార్యమును చేయుచూ రెండవ పనిగా మాట్లాడడము చేయుచున్నదో, అదే విధముగా మనస్సు శరీరములో బయటి అవయవములకు లోపలి అవయవములకు మధ్యవర్తిగా పని చేయడమే

కాక, శరీరములో జరిగిన విషయములన్నియూ జ్ఞాపకము పెట్టుకొని అవసర మొచ్చినప్పుడు జ్ఞప్తి చేయగలుగుచున్నది. మననము అనగా 'జ్ఞాపకము' అని అర్థము. మననము చేయునది కనుక దానిని మనస్సు అని పేరు పెట్టడము జరిగినది. మనస్సు మరణములో నిలిచిపోయినది, కనుక ఆ సమయములో మనిషికి జ్ఞాపకమనేదే లేదు. అందువలన మరణమును గురించి ఎవరూ చెప్పుటకు సాధ్యపడదు. అయినా **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథములో మరణమును గురించి, మరణ సమయము లో ఏమి జరుగుచున్నదో దానిని గురించి వివరముగా చెప్పబడినది. మరణమే పెద్ద రహస్యము, అంత పెద్ద రహస్యమును గురించి చెప్పినప్పుడు అకాల మరణమును గురించి సులభముగా చెప్పవచ్చును.

కాలమును అనుసరించి కాలములో నిర్ణయించబడిన గడువు ప్రకారము వచ్చునది మరణము. అందువలన దానిని కాల మరణము అంటున్నాము. కాలములో నిర్ణయించబడిన గడువు రాకముందే వచ్చు మరణమును అకాల మరణము అంటున్నాము. అకాల మరణములో బయటి ఇంద్రియములయిన పది భాగములు జీవుడు వదలి లోపలి భాగములయిన పదిహేను భాగములలోనే నివాసముండును. శరీరము రెండు భాగములుగాయున్నది. ఒకటి బయటి భాగము, రెండు లోపలి భాగము. బయటి భాగములో ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు మొత్తము పది భాగములు కలవు. పైకి కనిపించు శరీరమునకే పది భాగములున్నవి కనుక స్థూల శరీరమని అర్థము. లోపల పదిహేను భాగములుగాయున్నా దానిని సూక్ష్మశరీరము అంటున్నాము. అది కనిపించదు, కావున దానికి ఆ పేరు వచ్చినది. అకాల మరణములో జీవుడు స్థూలశరీరమును వదలి సూక్ష్మశరీరములో మాత్రముండును. సూక్ష్మ

శరీరములో మనస్సు ఉండుట వలన చనిపోకముందు గల జ్ఞాపకములన్నీ అతను చనిపోయిన తర్వాత కూడా ఉన్నాయి. మనిషి తన స్థూలశరీరమును కోల్పోయి సూక్ష్మముగా ఉండును. అందువలన అకాల మరణము పొందిన వాడు రెండవ జన్మకు పోవు అవకాశమే లేదు. అకాల మరణమును పొందినవాడు బాహ్య శరీరమును వదలి అంతర శరీరముతోయుండుట వలన వాడు పూర్తి మరణించిన వానితో సమానము కాదు. రెండు శరీరములను కోల్పోయినప్పుడే కాల మరణమగును. కాల మరణము కానప్పుడు అకాల మరణములో వాడు కనిపించు శరీరముతో లేకుండా పోవునుగానీ, కనిపించని శరీరముతో ఉన్నాడని తెలియుచున్నది. బయటి శరీరము చనిపోయినందున వానిని అందరూ చనిపోయాడని అనుకొందురు. అయినా వాడు పూర్తి చనిపోక, సగము పది శరీర భాగములు చనిపోయినవాడై మిగతా పదిహేను భాగములతో జీవించియున్నాడు. అది బయటికి మరణమైనా వాడు సూక్ష్మముగా సజీవముగానేయుండును. సగము శరీరముతో సజీవముగా యున్నవానికి బ్రతికియున్నప్పుడున్న జీవితములాగే మిగతా జీవితమంతయూ గడచును. అలా అకాల మరణమును పొందిన వానికి గుణములలోనూ, వ్యక్తిత్వములోనూ ఏమాత్రము మార్పు ఉండదు. స్థూలశరీరముంటే అందరికీ కనిపించేవాడు, స్థూలశరీరము లేనందున ఎవరికీ కనిపించడు. అకాల మరణమును పొందినవాడు మనుషుల మధ్యలోనే జీవించుచుండును. అతనికి స్థూలముతో బ్రతికియున్న వారందరూ కనిపించుచుందురు. అయితే అతనికి స్థూలము లేదు కావున అతను మన మధ్యలోనేయున్నా మనము అతనిని గుర్తించలేము. అతని మాటలు శబ్దముతో కూడుకొని ఉండవు. అందువలన అకాల మరణము పొందిన వాడు ఏమి మాట్లాడినా మనకు వినిపించదు. అతను వినిపించడు, కనిపించడు. మనము మాత్రము అతనికి కనిపిస్తాము.

మన మాటలను కూడా వినగలడు. దీనినే 'సూక్ష్మ జీవితము' అని అంటాము.

ప్రతి మనిషి రెండు శరీరముల కలయికతో బ్రతుకుచున్నాడు. పది భాగములుగల స్థూలశరీరము ఒకటికాగా, పదిహేను భాగముల సూక్ష్మ శరీరము రెండవది. కనిపించని సూక్ష్మశరీరము స్థూల శరీరములో ఇమిడి యున్నది. స్థూల, సూక్ష్మ రెండు శరీరములతో మనిషి నివశిస్తున్నా ప్రతి మనిషికి తన స్థూల శరీరము మాత్రము కనిపించునుగానీ, సూక్ష్మశరీరము కనిపించదు. అందువలన తన సూక్ష్మ శరీరమును తానే నమ్మలేని స్థితిలో మనిషి ఉన్నాడు. మనిషికి తెలిసినా తెలియకున్నా స్థూల, సూక్ష్మ రెండు శరీరములలో భూమిమీద నివశిస్తున్నాడు. అకాల మరణములో స్థూల శరీరముపోయి సూక్ష్మశరీరము మాత్రము మిగులును. సూక్ష్మశరీరము ఇతరుల దృష్టికి కనిపించదు, కావున బ్రతికియున్న మనుషలు సూక్ష్మమును నమ్మలేకున్నారు. అయితే అకాల మరణము చెందినవారికి అందరికీ సూక్ష్మ శరీరములు కనిపించును. ఎందుకనగా! తాము కూడా అకాల మరణము చేత సూక్ష్మముగా మారియుండుట వలన, సూక్ష్మశరీరమునకు గల దృష్ఠి వలన ఇతర సూక్ష్మములను చూచు అవకాశము కలదు. అలా ఇతర సూక్ష్మశరీరములను చూచినప్పుడు దాదాపు బ్రతికియున్న జనాభాతోపాటు సూక్ష్మముగా బ్రతుకుచున్న వారు కూడా కలరని తెలియగలదు. ఆ విషయము తెలిసిన అందరూ ఆశ్చర్యపోవులాగున సూక్ష్మ ప్రపంచమున్నదని తెలియుచున్నది. సూక్ష్మముగా కొంతకాలము బ్రతికిన తర్వాత వారందరూ కాలమరణమును చెంది సూక్ష్మ శరీరమును కూడా వదలి రెండవ జన్మకు పోవడము జరుగుచున్నది.

ఒక మనిషి జీవితకాలము 80 సంవత్సరములుగా ఉందను కొందాము. అటువంటివాడు తన కర్మప్రకారము 35 సంవత్సరములకు అకాల మరణమును పొందాడనుకొనుము. అకాల మరణము తర్వాత కూడా మనిషి సూక్ష్మశరీరముతో తన జీవితములో మిగిలిన 45 సంవత్సరములు బ్రతుకవలసియున్నది. అప్పటికి 80 సంవత్సరములు పూర్తి అగుట వలన అప్పుడు కాల మరణముపొంది తర్వాత జన్మకు పోవడము జరుగుచున్నది. అతను 35 సంవత్సరములు కనిపించే మనిషిగా బ్రతికినవాడు, 45 సంవత్సరములు కనిపించని మనిషిగా బ్రతుకవలసివచ్చుచున్నది. అటువంటి సూక్ష్మ జీవితమును నమ్మనివారు చాలామంది కలరు. అయితే అటువంటి వారిలో కొంతమందికయినా అకాల మరణము వ్రాసిపెట్టబడి యుండును. అకాల మరణమును పొందిన తర్వాత వారు మేము ఇప్పుడు చెప్పిన మాటను సత్యమని ఒప్పుకోక తప్పదు. అప్పుడు సూక్ష్మప్రపంచము ప్రత్యక్షముగా తెలియుచుండుట వలన 'నేను నమ్మను' అనుటకు వీలులేదు. ఎంత హేతువాదులయినా హేతువు ప్రత్యక్షముగా కనిపించినప్పుడు సూక్ష్మ లోకమును గురించి ఒప్పుకోక తప్పదు. సూక్ష్మముగా యున్నవారికి బ్రతికి యున్నప్పుడున్నట్లే కష్టసుఖముల అనుభవములు, అనేక విషయ సంఘటనలు ఉండుట వలన స్థూలశరీరములో ఉన్నట్లే అన్నీగలవని తెలియును. ఒక్క కనిపించని ప్రత్యేకత తప్ప స్థూల జీవితమునకు, సూక్ష్మజీవితమునకు ఏమీ తేడాలేదు. ఈ విధముగా మనిషి అకాల మరణము పొందిన తర్వాత కూడా జీవితము కొనసాగుతున్నదనీ, జన్మ మారకుండా అదే జన్మలోని జీవితమే కొనసాగుతున్నదని తెలియుచున్నది. దీనినిబట్టి మరణము తర్వాత క్రొత్త జన్మలో జీవించడము కలదనీ, అకాల మరణము తర్వాత పాతజన్మలోనే జీవితము కలదని తెలియుచున్నది. మనిషికిగల నాలుగు మరణములలో రెండు మరణముల వివరము తెలిసిపోయినది.

**ప్రశ్న :- అకాల మరణము పొందినవానికి స్థూల శరీరము ఉండదు కదా! వారికి శ్వాసకోశములు ఉండవుకదా! అలాంటప్పుడు వారు ఎలా శ్వాసించుదురు? వారికి రక్తప్రసరణము జరుగుటకు శరీరమే లేదుకదా! అప్పుడు వారి జీవితము ఎలా కొనసాగును?**

**జవాబు :-** ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు మాత్రమే స్థూల శరీరముగా లెక్కించబడుచున్నది. శ్వాసకోశమునకు సంబంధించిన ప్రాణ, అపాన, ఉదాన, వ్యాన, సమాన వాయువులు ఐదు స్థూల శరీరమునకు సంబంధించినవి కావు. ఈ ఐదు వాయువులు సూక్ష్మశరీరము నకు సంబంధించినవి. అలాగే రక్తప్రసరణము స్థూలముగా జరుగకున్నా సూక్ష్మముగా వాయువులు శరీరములో చేరి సూక్ష్మశరీరమంతా నిండియున్నవి. రక్తము లేకున్నా ప్రాణవాయువు సూక్ష్మశరీరములో చేరియున్నది. కావున స్థూలములో బ్రతికినట్లే మనిషి సూక్ష్మములో కూడా బ్రతుకుచున్నాడు. ఆ విషయము స్థూల శరీరములో యున్నవారికి తెలియకపోయినా అక్కడ మాత్రము సూక్ష్మజీవితము యథేచ్ఛగా సాగిపోవుచున్నది. సూక్ష్మ శరీరమును మన భాషలో 'దయ్యము' అంటున్నాము. దయ్యము అంటే ఏదో అనాగరిక భాష అని అనుకోవద్దు. రేపు మనము కూడా దయ్యాలయ్యేదుందేమో చెప్పలేము కదా!

మనిషికి సంభవించు కాలమరణము తర్వాత క్రొత్త జన్మ క్రొత్త జీవితమున్నదనీ, అట్లే మనిషికి సంభవించు అకాల మరణము తర్వాత పాత జన్మలోనే, పాత జీవితమే ఉండునని తెలిసిపోయినది. ఇక తాత్కాలిక మరణము తర్వాత ఎట్లుండునో తెలుసుకొందాము. జీవిత కాలములో కర్మ అయిపోతే వచ్చునది కాల మరణము. అలాగే జీవిత కాలములో కర్మ ఇంకా మిగులుగా యున్నప్పుడే వచ్చునది అకాల మరణము. జీవిత

కాలములో స్థూల కర్మ అయిపోయి సూక్ష్మ కర్మ మిగిలిన వారికి అకాల మరణము వచ్చి, సూక్ష్మకర్మను సూక్ష్మదేహముతోనే అనుభవించుదురు. ఇకపోతే జీవితములో స్థూల కర్మ అయిపోకనే స్థూలముగా మరణించినా, సూక్ష్మముగా జీవుడు ఆ దేహమును వదలకుండా ఉండడమును **'తాత్కాలిక మరణము'** అని అంటాము. వాస్తవముగా తాత్కాలిక మరణములో మరణమనునదే లేదు, అయినా దానిని మరణమని చెప్పవలసి వచ్చినది. జీవుడు శరీరమును వదలిపోతే దానిని మరణము అనవచ్చును. అయితే మరణము అను అర్థము ప్రకారము శరీరములో కదలికలు ఆగిపోతే కూడా మరణము అని అనవచ్చును. ఇక్కడ జీవుడు శరీరమును వదలిపోకున్నా శరీరములోని కదలికలన్నీ ఆగిపోవుచుండుట వలన దానిని **'తాత్కాలిక మరణము'** అని చెప్పవలసి వచ్చినది.

తాత్కాలిక మరణములో శ్వాస ఆగిపోవును, కదలికలు నిలిచి పోవును. ఆత్మ తన పనిని ఎంతో కొంత సేపు ఆపివేయును. శరీరములో ఎల్లకాలము పనిచేయునది ఆత్మే అయివుండుట వలన ఆత్మ ఎప్పుడు నిలిచిపోవునో అప్పుడు శరీరములోని పనులన్నీ స్థంభించిపోవును. అలా శరీరములోని కదలికలన్నీ నిలిచిపోవడము వలన, శ్వాస కూడా ఆడని దానివలన, దానిని ఒక విధముగా మరణమనియే చెప్పవచ్చును. అయితే మరణములాంటి ఈ మరణములో ఆత్మగానీ, జీవాత్మగానీ శరీరమును వదలి బయటికి పోరు. అందువలన మరణమని చెప్పుటకు వీలులేదు. కొద్దిసేపుగానీ, ఎక్కువ కాలముగానీ అలాగే శరీరములో ఆత్మ కదలకయుండి తర్వాత కదలి పని చేయుట వలన, శ్వాస ఆడుట వలన చనిపోయినాడను కొన్నవాడు బ్రతుకుతున్నాడు. కొన్ని గంటలుగానీ, కొన్ని దినములుగానీ మరణస్థితిలోయున్నవాడు తిరిగి అదే శరీరములో మెలుకువలోనికి

రావడమును తాత్కాలిక మరణము అంటున్నాము. మరణించినట్లు కనపడు శరీరములో ముందువున్న జీవుడే తిరిగి యథాస్థితిలోనికి రావడము ఆశ్చర్యమే అయినా అది సత్యబద్ధముగా కొన్నిచోట్ల జరుగుచున్నది. ఒకే మనిషి ఒకే శరీరములో రెండుమార్లు చనిపోవడము రెండుసార్లు బ్రతికినట్లు కనిపించుచున్నది. రెండవమారు జరుగునది కాలమరణమో, అకాల మరణమో, అయినా మొదట చనిపోయి లేచినప్పుడు దానిని తాత్కాలిక మరణము అంటున్నాము. తాత్కాలిక మరణము ఆత్మ ఇష్టమును బట్టి జరుగుచున్నది. ఒక శరీరములో ఆత్మ ఎంతసేపు అణిగిపోయి కదలికలు లేకున్నదో, అంతసేపు వాడు తాత్కాలిక మరణమును పొందినట్లేయగు చున్నది. మిగతా రెండు మరణములలో ఆత్మ, జీవుడు బయటికి పోగా ఈ మరణములో ఆత్మగానీ, జీవాత్మగానీ బయటికి పోవడము జరుగదు. కొంత కాలము శరీరములో అణిగిపోయిన ఆత్మ తిరిగి తన చైతన్యమును శరీరమంతయూ వ్యాపింప చేసి తిరిగి కదలికలను మొదలుపెట్టుట వలన అదే శరీరములో, అదే జీవుడు జీవనమును సాగించుచున్నాడు. ఈ విధముగా తాత్కాలిక మరణము పొందినవాడు ఆ తాత్కాలిక మరణము తర్వాత జీవితమును సాగించుచున్నాడు.

మరణము తర్వాత వెంటనే ఒక సెకను కూడా ఆలస్యము లేకుండా క్రొత్త శరీరములో క్రొత్త జీవితము వచ్చుచున్నది. అకాల మరణము యొక్క విషయానికి వస్తే, ఇందులో కూడా జీవుడు స్థూలశరీరమును మాత్రమే వదలి, సూక్ష్మశరీరమును వదలక పాతశరీరములోనే పాత జీవితమునే జీవుడు గడుపుచున్నాడు. మూడవదయిన తాత్కాలిక మరణమును గురించి ఆలోచించితే పాతశరీరములోనే అదియూ స్థూలశరీరముతోనే పాత జీవితమే అనుభవమునకు వచ్చుచున్నది. మూడు మరణములలోనూ ఏదో ఒక

విధముగా క్రొత్తదో పాతదో జీవితమే ఏర్పడుచున్నది. కాల, అకాల, తాత్కాలిక అను మూడు మరణముల తర్వాత సాధారణ జీవితమే యున్నదని తెలియుచున్నది. అయితే కొంత ప్రత్యేకతతో కూడుకొన్న ఆఖరీ మరణము తర్వాత ఏ జీవితమూ ఉండదని తెలియుచున్నది. చివరి మరణము తర్వాత జీవితమూ ఉండదు, దాని తర్వాత మరణము ఉండదు. అందువలన ఆ మరణమును చివరి మరణము లేక ఆఖరీ మరణము అని అంటున్నాము. ఆఖరీ మరణము తర్వాత ఇక జీవితముండదు. జీవితమునకు కావలసిన కర్మయుండదు. కర్మ ఏమీ లేకుండా పోయినప్పుడే ఆఖరీ మరణము ఏర్పడుచున్నది.

**ప్రశ్న :- "మరణానంతర జీవితము" అను ఒక చిన్న పుస్తకమును చూచాను. అందులో ఇలాంటి జీవితమే ఉండదని వ్రాశారు. అది కేవలము 12 పేజీల పుస్తకమే. మీరు చెప్పిన మరణములను గురించి వారు చెప్పలేదే?**

**జవాబు :-** మరణము అంటే అది ఎవరి అనుభవమునకు లేనిదని మేము ముందే చెప్పాము. మరణించిన వానికి తన మరణము ఎలా జరిగినదో జ్ఞాపకముండదు. అలాగే జన్మించిన వానికి తన జననము ఎలాగున్నదో కూడా తెలియదు. అందువలన జనన మరణములను గురించి ఎవరూ చెప్పలేరు. జనన స్థితిని గురించి మరణ స్థితిని గురించి ఆ దేవునికి తప్ప ఇంతవరకు ఎవరికీ తెలియదు. అందువలన మరణము తర్వాత జీవితమును గురించి వారు పెద్దగా వ్రాయలేకపోయారు.

**ప్రశ్న :- మీరు ఇప్పుడు మరణములను గురించి వ్రాశారు కదా! మరణమును గురించి దేవునికి తప్ప ఎవరికీ తెలియనప్పుడు మీరు ఎలా వ్రాయగలిగారు?**

**జవాబు :-** వాస్తవముగా ఈ జ్ఞానమును గురించి నాకు ఏమీ తెలియదని

మొదటినుండి చెప్పుచునేయున్నాను. ఇంతవరకు వ్రాసిన గ్రంథములలో ఏదీ నేను స్వయముగా నాకు తెలిసి వ్రాయలేదు. నేను నాయుక్త వయస్సు నుండే నా శరీరములో నేను ఒక్కడినే కాదు ఇంకొకరున్నారని చెప్పుచూనే వస్తున్నాను. అతనే శరీరమునకు అధిపతియనీ, అతని శరీరములో నేను ఒక ప్రక్కన రవ్వంతగా యున్నాననీ, ఇంతకుముందు ఎన్నోసార్లు చెప్పాను. అతనే శరీరములోని దేవుడు. శరీరములోని దేవునికి తెలియనిది ఏదీలేదు. అన్ని రహస్యములు ఆయనకే తెలుసు. జనన మరణ రహస్యములన్నియూ ఆయనకే తెలుసు. ఆయన ఎట్లు ఆడిస్తే జీవుడు అట్లు ఆడవలసిందే! శరీరములో ఆత్మగా ఉండి శరీరమంతటా ఆవహించిన వాడు శరీరములో ఒక్కచోట యున్న జీవునికి అధిపతిగా, ఈశ్వరునిగా ఉన్నాడు. నా శరీరములో యున్న అధిపతిని నేను మొదటినుండి గుర్తించాను. ఆయనే నన్ను నడిపించువాడని, ప్రతిదానికీ ఆయనే దర్శకుడని చెప్పుచూనే ఉన్నాను.

ఇప్పుడు నేను వ్రాశాను అనుకొను మరణ రహస్యములన్నియూ ఆయన వ్రాయించినవే. ఇంతవరకు జీవుడు దేవుడు అను విషయమే అందరికీ తెలుసు. అయితే దేవుడు నేను ఏమీ చేయనివానిననీ, కేవలము సాక్షిగాయుండువానిననీ దైవగ్రంథములలో చెప్పాడు. అయితే జీవుడు కూడా ఏమీ చేతకానివాడే అయివున్నాడు. దేవుడు చేయడు, జీవుడు చేయలేడు. అటువంటప్పుడు ఇంతపెద్ద ప్రపంచము ఎలా జరుగుచున్నదని ప్రశ్నించుకొని చూస్తే జీవునికి, దేవునికి మధ్యలో మరియొకడున్నాడని తెలియుచున్నది. అతనే శరీరములో దేవుడు. అన్ని శరీరములలో దేవుడుగా ఒకే ఆత్మ గలదు. జీవున్ని జీవాత్మయని పిలువగా, దేవున్ని పరమాత్మయని పిలువగా, వీరి మధ్యలోయున్నవానిని ఆత్మ అని పిలుస్తున్నాము. మధ్యయున్న వానినే శరీరములోని దేవుడని మేము చెప్పుచున్నాము.

ఇంతవరకు ఎందరో ఆధ్యాత్మికవేత్తలు జీవాత్మ, పరమాత్మలను గురించే చెప్పారుగానీ, మధ్యయున్న ఆత్మను గురించి చెప్పియుండలేదు. ఈ విషయము మూడు దైవగ్రంథములలో దేవుడు చెప్పియున్నా ఆ విషయమును ఎవరూ విప్పి చెప్పుకోలేదు. అందువలన ఆత్మ విషయము ఇంతవరకు ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును.

మేము దైవగ్రంథములో చెప్పిన ఆత్మను గుర్తించి చెప్పడమేకాక ఆయనే అన్నిటినీ అందరిచేత చేయిస్తున్నాడని చెప్పుచున్నాము. భూమిమీద ఎక్కడయినాగానీ, ఎవడయినా గానీ ఒక మంచి పనిచేసినా, లేక ఒక చెడు పనిని చేసినా పైకి కనిపించు జీవుడు చేయలేదు. కనిపించకుండా వానియందు అణిగియున్న ఆత్మయే చేయించుచున్నది. ఒకనిని ప్రమాదము నకు గురి చేసినా, లేక ప్రమాదమునుండి కాపాడినా అది మధ్య ఆత్మ చేసిన పనియే, దేవుడు ఏమీ చేయడు. అది ఆయన ధర్మము. జీవుడు ఏమీ చేయలేడు. ఇది జీవుని ధర్మము. ఇకపోతే అన్నీ చేయువాడు ఆత్మయేయని తెలియవలెను. ఇవన్నియూ గమనించిన తర్వాత ఆ విషయము అందరికీ తెలియునట్లు ఇప్పుడు నాచేత **"జనన మరణ రహస్యములు"** వ్రాయించినది కూడా మధ్యలో గల ఆత్మయే. మధ్య ఆత్మకు తెలియని రహస్యమంటూ ఏదీ లేదు. మధ్య ఆత్మ ప్రతి శరీరములోయుండి అన్నీ తానే చేయించుట వలన జననము ఆయనకు తెలుసు, మరణము ఆయనకు తెలుసు. ***జంత్రగాడు బొమ్మలను ఆడించునట్లు ఆత్మ అన్ని శరీరముల బొమ్మలను ఆడించుచున్నది.*** ప్రతి పనిని ప్రతి మనిషిచేత చేయించుచూ, తాను మాత్రము ఎవరికీ తెలియకుండా శరీరములో దాగియున్నది. శరీరములో దాగియున్న ఆత్మ యొక్క ఉనికిని చాలా కాలమునుండి చాలామంది తెలియలేక, దేవుడే అన్ని పనులు చేయు

చున్నాడని అనుకోవడము జరుగుచున్నది. అయితే దేవునికంటూ కొన్ని ధర్మములు కలవు. తన ధర్మముల ప్రకారము దేవుడు ఉండును. దేవుని ప్రాథమిక ధర్మము ప్రకారము ఆయనకు రూప, నామ, క్రియలు లేవు. దీనినిబట్టి దేవునికి రూపములేదు, పేరులేదు, కార్యములు లేవు. అందువలన ఆయన ఏమీ చేయనివాడే! జీవుడు ఏదీ చేతకానివాడే!! అన్నీ చేయువాడు ఆత్మేనని తెలియవలెను. అన్ని పనులను చేయు ఆత్మను తెలియడమే ఆధ్యాత్మికము. నీవు ఆత్మను తెలియగలిగితే మనిషి చేత రహస్యములను కూడా చెప్పించునది ఆత్మయేనని తెలియగలవు. మనిషి చేత చెప్పించుట వలన ఆత్మ విషయము తెలియని మనిషి, తానే స్వయముగా రహస్యములను చెప్పాను అని అనుకొంటున్నాడు. నాకు ఆత్మకు సంబంధించిన ఆధ్యాత్మికము తెలుసు. కావున నేను కాదు ఆత్మే అన్నీ చెప్పినదని చెప్పగలుగు చున్నాను.

**ప్రశ్న :- మీరు చెప్పునదంతా విన్నాము. ఇతరులు చెప్పునది కూడా విన్నాము. ముఖ్యముగా ముస్లీమ్‌లు వారి దైవగ్రంథమయిన ఖురాన్‌లో ప్రళయము వరకు చనిపోయిన వారందరినీ ఒక్కమారుగా లేపుతాడనీ, ఒక్కమారుగా లేపబడిన జన సమూహమునకు వారివారి తప్పుఒప్పుల ప్రకారము తీర్పునిస్తాడని చెప్పుచున్నారు. దీనినిబట్టి మీరు ఇంతవరకు చెప్పినదంతయూ అసత్యముగా తెలియుచున్నది. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** ముస్లీమ్‌లు మొదటినుండి ఈ మాటనే చెప్పుచున్నారు. ఈ విషయము వారి దైవగ్రంథములో ఉన్నదని చెప్పుచున్నారని మీరన్నారు. ఖురాన్ గ్రంథము ముస్లీమ్‌లకు ఒక్కరికే దైవగ్రంథము కాదు, అది సమస్త మానవులకు దైవగ్రంథమే. అయితే దైవగ్రంథములో దేవుడు చెప్పిన విషయములు అందరికీ సమానముగా అర్థమయినాయని చెప్పలేము.

ప్రళయ కాలము చివరిలో దేవుడు అందరినీ సమీకరించుట నిజమే, వారి కర్మల ప్రకారము తీర్పు నివ్వడము వాస్తవమే. అయితే మూకుమ్మడిగా ఆ పని జరుగుచున్నదని దేవుడు తన గ్రంథములో ఎక్కడా చెప్పలేదు. వాస్తవముగా అట్లు జరుగడము లేదు. మనిషికి వ్యక్తిగతముగా జరిగిన ప్రళయము చివరిలో అతనిని దేవుడు తిరిగి సమాధినుండి లేపడము సహజమే. అయితే అది భూసమాధి కాదు. మూర్ఛస్థితిని సమాధి అని చెప్పుట సహజము. ఉదాహరణకు రామక్రిష్ణపరమహంస మూర్ఛస్థితిలో అప్పుడప్పుడు పడిపోయెడివాడు. అప్పుడు ఆయన శిష్యులు మా గురువు గారు సమాధి స్థితిలోనికి పోయాడనిగానీ, సమాధిలోనికి పోయాడనిగానీ చెప్పెడివారు. ఇక్కడ దేనిని సమాధి అంటున్నామో, మనిషి పుట్టుకలో అదే స్థితినుండి లేస్తున్నాడు. కావున సమాధి నుండి మనిషిని లేపినప్పుడు అతని కర్మ చిట్టా ప్రకారము అతనికి తీర్పు ఇవ్వబడును అనివుంది. అనగా అతని కర్మప్రకారము తర్వాత జన్మ ఎలా జరుగవలెనో, అది సుఖమయమో లేక కష్టమయమో దానిని దేవుడు నిర్ణయము చేయును. ఇదే వాస్తవముగా జరుగుచున్న విధానము, ఇదే విధానమును అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో చెప్పారు. అంతేగానీ మూకుమ్మడిగా సృష్ఠినుండి ప్రళయము వరకు పుట్టినవారందరినీ ఒక్కమారుగా లేపుతానని చెప్పడము గ్రంథములో ఎక్కడా లేదు. దేవుడు చేయుచున్న తన విధానమును ఖురాన్ గ్రంథములో చాలా విపులముగా చెప్పాడు. అయితే దానిని అర్థము చేసుకోవడములో ఎందరో పొరపాటు పడడము జరుగుచున్నది. ఖురాన్ గ్రంథములో దేవుడు చెప్పినది ఒకటయితే మనిషి అర్థము చేసుకొన్నది మరొకటిగా ఉన్నది. మనిషియొక్క చావు పుట్టుక విషయములో చాలామంది దేవుడు చెప్పిన దానిని అర్థము చేసుకోలేదనియే చెప్పాలి.

**ప్రశ్న :- అయితే ఖురాన్‌లో చెప్పినది అబద్ధమంటారా?**

**జవాబు :-** నేను ఎప్పుడూ ఆ మాటను అనలేదు. అది దైవగ్రంథము. దానిలోని దేవునిమాట ఏదీ పొల్లుపోదు. అయితే ఖురాన్‌లో ఇలా ఉంది అని మీరు చెప్పేమాట అసత్యము. మూకుమ్మడిగా మనుషులనందరినీ ఒక్కమారుగా లేపుతానని ఖురాన్‌లో చెప్పలేదు. మనిషి పునర్జన్మను గురించి ఎన్నో ఆయత్‌లు అందులో వ్రాసిపెట్టబడి ఉన్నాయి. అయినా కొందరు ముస్లీమ్‌లు పునర్జన్మలు లేవు అంటున్నారు. దీనినిబట్టి వారి పెద్దలు చెప్పినదానినే వారు గట్టిగా నమ్ముచున్నారు గానీ, గ్రంథములో చెప్పిన దానిని వారు నమ్మలేదని తెలియుచున్నది.

**ప్రశ్న :- మరణము తర్వాత జీవితమును గురించి చెప్పుచూ, దేవుడు వాని కర్మప్రకారము విధించు స్వర్గనరకములే తర్వాత వాని జీవితమన్నారు, అది వాస్తవమేనా?**

**జవాబు :-** మరణము తర్వాత నిర్ణయించబడు స్వర్గనరకములు ప్రత్యేక లోకములని కొందరు చెప్పుచున్నారు. అయితే స్వర్గనరకములలో వేరువేరు అనుభవములుండే దానివలన, వాటిని అర్థము చేసుకొనుటకు స్వర్గ నరకములు ప్రత్యేక లోకములన్నారు. వాస్తవానికి స్వర్గనరకములు ప్రత్యేక లోకములు కావు. మనిషి అనుభవించు సుఖదుఃఖ అనుభవములను స్వర్గనరకములన్నారు. లోకము అంటే అదేదో ప్రత్యేక దేశమనో, ప్రత్యేక ప్రపంచమనో అర్థము చేసుకోకూడదు. లోకము అంటే శరీరములోని ఒక విధానము అని అర్థము. భగవద్గీతలో **"ద్వావిమౌ పురుషౌ లోకే"** అని పురుషోత్తమ ప్రాప్తి యోగములో చెప్పబడినది. అక్కడ లోకము అంటే శరీరములోని విధానములో లేక శరీరములో రెండు రకముల పురుషులు కలరని అర్థము. దీనిప్రకారము శరీర విధానములో సుఖమును స్వర్గ

లోకమనీ, అట్లే శరీర విధానములో కష్టమును అనుభవించుటను నరక లోకమనీ చెప్పవచ్చును. దేవుడు శరీరములో జీవుడు అనుభవించు విధానమునే చెప్పాడు. కావున లోకములనునవి శరీరము బయట లేవు శరీరము లోపలే ఉన్నాయని చెప్పవచ్చును. మనిషి శరీరములో గుణములతో చేయు ఆలోచనల విధానమును కూడా లోకము అన్నారు. మూడు రకముల గుణముల ఆలోచనలను మూడులోకములుగా చెప్పారు. మనిషి గుణము లను వాటి ఆలోచనలను జయించలేక ఉన్నాడనీ లేక దాటలేక ఉన్నాడని చెప్పుచూ, ఒక తత్త్వవేత్త అయిన వారు **"మూడు కాల్వలు దాటలేరన్నా ఇల మూఢజనులు"** అని తన బోధలో చెప్పాడు. ఇక్కడ మూడు కాల్వలని మూడు విధానములుగా యున్న మూడు గుణములనే చెప్పాడు. భగవద్గీతలో కూడా 'ముల్లోకములు' అనేమాట చాలాచోట్ల వినిపించినా, అక్కడ ప్రత్యేక ప్రపంచములుగా వాటిని అర్థము చేసుకోకూడదు. వాటిని శరీరాంతర్గత విధానములుగా అర్థము చేసుకొన్నప్పుడే సరియైన జ్ఞానము అర్థము కాగలదు. ప్రత్యేక ప్రపంచములుగా అర్థము చేసుకొంటే, జ్ఞానమార్గములో ముందుకు పోయే దానికి వీలుపడదు. జ్ఞానము ఏమీ అర్థముకాదు. అందువలన స్వర్గ, నరక లోకములు అనునవి శరీరములో అనుభవించు వేరువేరు విధానములని తెలియవలెను. మనిషి అనుభవానికి వచ్చు కష్ట, సుఖ విధానములనే స్వర్గ, నరకములని అంటున్నాము.

**ప్రశ్న :- స్వర్గములో మగవారికి సేవలు చేయుటకు అందమైన స్త్రీలు కొందరుంటారనీ, అలాగే ఆడవారు స్వర్గానికి పోతే అక్కడ వారికి సేవ చేయుటకు అందమైన అబ్బాయిలు ఉంటారని ఖురాన్ గ్రంథములో చెప్పబడినది దీనిని మీరు కాదంటారా?**

**జవాబు :-** కాదని నేను చెప్పలేదు. మగవారు సుఖములు అనుభవించినా,

ఆడవారు సుఖములను అనుభవించినా ఆ సుఖములను శరీరములోనే అనుభవిస్తున్నారని చెప్పుచున్నాము. మనుషులు చేసుకొన్న పుణ్యమునుబట్టి వారికి సేవలు చేయువారు ఎంతమంది అయినా ఉండవచ్చును. కాదని చెప్పలేము కదా! సుఖములు ఎన్ని విధములైనా అనుభవించవచ్చును. అదంతయూ అతను చేసుకొన్న పుణ్యమునుబట్టియుండును. ఎవరు ఎట్లు సుఖమును అనుభవించినా అది స్వర్గ సంబంధ విధానమనీ, అది శరీరము లోనే అనుభవమును పొందుచున్నాడని తెలియుచున్నది. మనుషులందరికీ ఒకే విధమైన సుఖము ఉంటుంది అనుకోవడము పొరపాటు. ఎవరు చేసుకొన్న పుణ్యఫలమునుబట్టి వారికి సుఖము ఉంటుందని తెలియవలెను.

**ప్రశ్న :- మరణము తర్వాత జీవితము పరలోకమునకు సంబంధించినదా? ఇహ లోకమునకు సంబంధించినదా?**

**జవాబు :-** మరణము తర్వాత జీవితము ఇహ లోకమునకు సంబంధించి నదే. అనగా ఇక్కడ ఈ జీవితమునకు సంబంధించినదే. పరలోకమునకు సంబంధించినది కాదు. పరలోకము అంటే శరీరములోపల అనుభవించు నదికాదు. శరీరము బయట అంతటా వ్యాపించిన దానిని పరలోకము అంటాము. ఇహలోకము కానిది పరలోకము. ఈ శరీరములోని అనుభవ విధానము కాకుండా, శరీరము బయటనున్న దానిని అనుభవించు విధానమును పరలోకప్రాప్తి అంటారు. ***శరీరములోపల ఇహలోకము, శరీరము బయట పరలోకమని అర్థము చేసుకొన్నప్పుడే దైవజ్ఞానము సరియైన మార్గములో అర్థము కాగలదు.*** నేడు మనుషులందరికీ లోకములు రెండు రకములనీ, ఒక రకము శరీరము లోపలగలదనీ, రెండవ రకము శరీరము బయటగలదనీ తెలియదు. శరీరములోపల యున్న లోక విధానములు గుణములనుబట్టి అనుభవములనుబట్టి యుండుట వలన

శరీరములోగల దానిని ఇహలోకము అంటున్నాము. ఇహలోకము గుణముల వలన మూడు విధములుగా యున్నా, అనుభవములు మాత్రము స్వర్గ, నరక అను రెండు రకములుగానే ఉన్నాయి. ఇకపోతే శరీరము బయట గల విధానమును పరలోకము అంటున్నాము. పరలోకము ఒకే రకముగాయుండి చీలికలు లేనిదై యున్నది. అందువలన అక్కడ మనిషి పొందు అనుభవము కూడా ఒక్కటే గలదు. అది ఇహలోకములోని స్వర్గ, నరకములవలె కాకుండా ప్రత్యేకమైనదై ఉన్నది. పరలోకములో సుఖము ఉండదు, దుఃఖము ఉండదు. శరీరములో ఎప్పుడు ఎక్కడా అనుభవించనిది, సుఖదుఃఖములు కానిది, ఇలాగున్నదని ఇతరులకు చెప్పలేని అనుభవ ముండును. అదే పరలోకములో గల దైవానుభూతి. ఎప్పుడూ అనుభవించని అనుభూతిని పరలోకములో అనుభవించడము జరుగుచున్నది. అది అన్నిటికంటే పెద్ద అనుభూతి అయినందున దానినే జ్ఞానులయినవారు **"బ్రహ్మానుభూతి"** అంటున్నారు. అది స్వర్గ నరకములకంటే ఎంతో గొప్పది. కావున ప్రతి మనిషి స్వర్గనరకములను ఆశించక పరలోకప్రాప్తిని కోరుకోవలె నని తెలుపుచున్నాము. మరణానంతర జీవితము ఇహలోక సంబంధము కాకుండా పరలోక సంబంధముగా ఉండవలెనని ప్రతి మనిషి కోరుకోవలెను.



**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

1) నాలుగు అధర్మములు పది శాతము మనుషులలో ఉండగా,
ఒక్క మతమను అధర్మము 99 శాతము గలదు.

2) యజ్ఞ, దాన, వేద,తపస్సులు నాల్గుకాగా, ఐదవ అధర్మము మతము.

3) దైవ మార్గమునకు పెద్ద ఆటంకము మతము.

4) అన్ని అధర్మములను మించినది మతమను అధర్మము.

5) ప్రపంచ మార్గములో మతము ఉంటే
దైవ మార్గములో హతమై పోతావు.

6) కలియుగములో క్రొత్తగా పుట్టుకొచ్చిన ఐదవ అధర్మమే మతము.

# మరణము తర్వాత జీవితము



ఇది అన్ని మతముల వారికి

www.thraithashakam.org